# ప్రజాసాహితి

సాహిత్య సాంస్కృతికోద్యమ మాస పత్రిక

275



* బొల్లిముంత శివరామకృష్ణ సంస్మరణలో
* అశాస్త్రీయం (కథ)
* తొలిమానవులు - ప్రకృతి (వ్యాసం) (విజ్ఞాన శాస్త్ర ధారావాహిక)

CT

కవిత

# అమ్మా

-నేదా ఖలీల్

అమ్మా నా గురించి భయపడొద్దు
మన భూమి విముక్తికోసం నేనిక్కడున్నాను
నేను వెళ్లిపోయానని రోదించకమ్మా
శిలాఫలకంలోని అక్షరాల్లా మీ హృదయాల్లో
మనసులో ఒక ముద్ర విడిచి వెళ్లినందుకు సంతోషించు
అమ్మా! దయచేసి ఇంక ఏమాత్రం భయపడొద్దు
మనం ఈ ప్రయాణం ఎన్నో ఏళ్ళుగా చేస్తున్నాం
అమ్మా! నా జ్ఞాపకాలు, ప్రజా ప్రతిఘటనలు సజీవమై ఉంటాయి
చిరకాలపు మన ఈ కడగండ్లు, మరొకసారి కోరను
అమ్మా! నా కూతురుకు చెప్పు, తనను ప్రేమిస్తున్నాననీ
తాను ఎప్పుడూ నా కళ్లల్లోనే మెదలుతూ వుందనీ,
నువ్వు నన్ను ప్రేమిస్తున్నావు కనుక ధైర్యంగా వుండు
నీ దుఃఖాన్ని దిగమింగుకో
అమ్మా నా కొడుకుతో చెప్పు, తనను నేను వదిలేయలేదని
అతని స్వాతంత్ర్యంకోసం, మన ప్రజల హక్కుల కోసం
స్వేచ్ఛా జీవనంకోసం ఇదంతా చేశా
అమ్మా! నా భర్తకు చెప్పు తనే నా సర్వస్వమనీ
నాకు తెలుసు ఆ పిలుపును నేనెందుకు స్వీకరించానో
అతను అర్థంచేసుకోగలడు
కనుక అమ్మా! చూడు!
ఇదంతా ఎలా వుండాలో సరిగ్గా అలాగే వుంది
ఇది నీకోసం, నాకోసం, మన పిల్లలకోసం, మన భవిష్యత్తుకోసం
ఈ అవమానాలకు చిత్రహింసలకు చరమగీతం పాడాలి
చూడమ్మా! ఇదంతా ఆ విధమైన ముగింపుకోసం
మనమంతా ఒక్కటైతేనే అంతిమంగా రక్షించుకోగలం
కనుక అమ్మా! నా కన్నతల్లీ! ఇక నీ కన్నీళ్లు ఆపెయ్
అవి నిరుపయోగం భయకారకాలు
నన్ను జ్ఞాపకం చేసుకుంటూ జీవించు
తెలుసుకో దీనివల్లనే
ఒక మార్పు వస్తుంది, స్వేచ్ఛ లభిస్తుంది
ఆల్ జరీరా ఇన్ఫోనుండి అనువాదం: దివికుమార్
మూలరచన, కాలం: 26.9.2004 అనువాదం: 31.3.2005






సంపుటి : 28 సంచిక : 12

275

జూలై, 2005

చందాలు పంపవలసిన చిరునామా :

కొత్తపల్లి రవిబాబు

ప్రధాన సంపాదకుడు, ప్రజాసాహితి

సాహితీసుధ, ఈదర రామయ్య వీధి,

ఐతానగరం, తెనాలి (పోస్టు) - 522 201.

ఫోన్ (08644) 222218

ravibabujs@yahoo.co.in

రచనలు పంపవలసిన చిరునామా:

నిర్మలానంద,

సంపాదకుడు,

ప్రజాసాహితి

1-8-747/11/40

బాగ్‌లింగంపల్లి

హైదరాబాద్- 500 044

e mail : prajasahiti@yahoo.com



అట్టమీద బొమ్మ :

బొల్లిముంత శివరామకృష్ణ

జననం:27.11.1920

మరణం: 7.6.2005

రెండవ అట్ట :

అమ్మా! (కవిత)

- నేదా ఖలీల్

మూడవ అట్ట :

పాలేరు పాట

- చెరబండరాజు

నాలుగవ అట్ట :

మా కళ్ళలోని అగ్గితో(టి)

- ఛాయరాజ్

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు. 10-00 |
| వ్యక్తులకు సం॥ చందా | రు. 100-00 |
| సంస్థలకు సం॥ చందా | రు.200-00 |
| విదేశాలకు సం॥ చందా | 50 డాలర్లు |

చందాలు మనియార్డరుగానూ, డి.డి.లుగాను మాత్రమే అంగీకరించబడును. మనియార్డర్లు తెనాలి చిరునామాకు పంపాలి. మనియార్డరు కూపనులో చందా పంపించువారు తమ చిరునామా తెలియజేయాలి.

డి.డి.లపై మేనేజర్, ప్రజాసాహితి, విజయవాడ అని రాయాలి.

## ఈ సంచికలో...



---


Edited, Printed and Published by K.RAVI BABU
at Chaitanya Printers, Vijayawada - 2.
for Co-operative Press, Vijayawada.
Editor : NIRMALANANDA

# మాంత్రికదండం వదిలి జపమాల ధరించిన అద్వానీ

**స్వాతంత్ర్యానంతర** తొలి హోంమంత్రి సర్దార్ వల్లభాయి పటేల్‌ను పాలకవర్గ గ్రూపులూ పాలకవర్గ మేధావులూ ఉక్కుమనిషిగా శ్లాఘిస్తే, లాల్‌కృష్ణ అద్వానీని ఎన్డీయే ప్రభుత్వ హోంమంత్రిగా నియమించుకున్న సంఘపరివారం, రెండవ ఉక్కుమనిషిగా అందరిచేతా గుర్తింపచేయించాలని చాలా ప్రయత్నం చేసింది. 2004వ సంవత్సరపు ఎన్నికలలో"దేశం వెలిగిపోతోంది" అనే నినాదాన్ని ప్రచారపు కేంద్రకంగా చేసిన రూపశిల్పిని తానేనని చెప్పుకున్న అద్వానీ, అది ఎదురుతన్ని తమ కూటమి ఓటమిపాలైన తర్వాత నాలిక్కరుచుకున్నారు. రామజన్మభూమి, రక్తప్లావిత రథయాత్ర, బాబ్రీమసీదు కూల్చివేతల ద్వారా కొన్ని రాష్ట్రాలలోనూ, కేంద్ర ప్రభుత్వంలోనూ భాజపాను అద్వానీ అధికారానికి తెప్పించినట్టే గత ఎన్నికల ఓటమినుండి గెలుపుకి నడిపించగల ధీమంతునిగా భావించారు. మరొకసారి అద్వానీ భాజపా అధ్యక్షుడైన వెంటనే, "రామ జన్మభూమి, హిందూత్వ ఎజెండానే ఏకైకమార్గం" అంటూ నినదించారు.

ఈ నెల మొదటి వారంలో పాకిస్తాను పర్యటనలో, కరాచీ సన్మానసభలో మహమ్మదాలీ జిన్నా ప్రస్తావన తెచ్చి వివాదాస్పదుడై, ద్రోహముద్ర వేయించుకుని, అధ్యక్ష పదవికి రాజీనామా సమర్పించి, బతిమాలించుకుని, చీవాట్లు తిని... చివరికి రాజీనామాను ఉపసంహరించుకున్నారు. కొన్ని రోజులపాటు మీడియాకు తద్వారా ప్రజలకు చర్చాకేంద్రంగా రూపొందారు. కరడుగట్టిన మత ఛాందసవాది, సంఘపరివారపు ముద్దుబిడ్డగా పేర్గాంచిన అద్వానీ, గతకాలపు నెత్తుటి మరకలు తుడుచుకుని ఉదారవాదపు ముద్రలతో పునర్జన్మించాలనుకున్నారు.

భారత పాలకవర్గాల అంతరంగిక రాజకీయ సంక్షోభం, ఏకపార్టీపాలనకు బదులు కూటముల పాలన స్థితికి పార్లమెంటరీ రాజకీయాల్ని చేర్చింది. ఒక కూటమికి నాయకత్వం వహించగల కాంగ్రెసు, తనకంపుని కప్పిపుచ్చుకోవడానికి వామపక్ష సెంటు రాసుకుంటూంటుంది. రెండవ కూటమికి నాయకునిగా ప్రపంచీకరణ దశ కాలంలో ఎదిగిన భాజపాకు, గాంధీ హత్యనుండి గుజరాతు ఘాతుకాల ద్వారా మెడనలంకరించుకున్న మతతత్వపు ఎముకలూ, పుర్రెలూ వదుల్చుకుని కాంగ్రెసు తరహా 'కుహనా లౌకిక' జపమాలలు ధరించాల్సిన తప్పని స్థితి ఏర్పడింది. పాలకవర్గాల అంతర్జాతీయ బంధువులూ, ప్రపంచ ప్రజల పాలిట రాబందులూ అయిన అమెరికా సామ్రాజ్యవాదులు, తమ ప్రస్తుత ప్రపంచ వ్యూహంలో భాగంగా భారత-పాకిస్తాన్ ప్రభుత్వాల స్నేహాన్నీ, ఐకమత్యంతో తమకు ఊడిగం చెయ్యటాన్నీ కోరుకుంటున్నారు.

డా॥ బి.ఆర్.అంబేద్కర్ ఉటంకించినట్టు "ప్రతిపక్షం లేకపోతే ప్రజాస్వామ్యం లేదు. "ప్రభువులవారి ప్రతిపక్షం" అను పదబంధం వ్యర్థమైనది కాదు. ప్రభువుల వారికి ప్రభుత్వమూ ఉండాలి. ప్రతిపక్షమూ కావాలి"(రెనడే-గాంధీ-జిన్నా" వ్యాసం నుండి). ధనస్వామ్య పాలకవర్గాలకు ఆమోదయోగ్యమైన గౌరవనీయ ప్రతిపక్ష నాయకునిగా, (తన తరుణంకోసం వేచియున్న ప్రధానిగా) భాజపాకు కొత్తరంగులద్ది మలిచే సంక్లిష్ట

రాజకీయ ప్రక్రియే ఈ రగడని అనివార్యంచేసిందని అర్థం చేసుకుంటే విషయాలు మనకు స్పష్టమవుతాయి.

ఈ రగడ సందర్భంగా దేశవిభజన; మహమ్మదాలీజిన్నా స్వభావం; నెహ్రూ; ఇందిరాగాంధీ; సంఘపరివారపు హిందూత్వ దృక్పథం-మరొకసారి చర్చనీయాంశా లైనాయి. ఉపఖండాన్ని భారత-పాకిస్తాన్‌లుగా విడదియ్యటం బ్రిటీషువారికి రాజకీయ అవసరం. నెహ్రూ, జిన్నాలకు అన్యుల పోటీ లేకుండా అధికారం పొందటం అవసరం. మతవాదులకు విద్వేషవ్యాప్తి అవసరం. దేశ విభజన అనే ఘోరమైన పాపాన్నంతా మహమ్మదాలీ జిన్నా మూపునే మూట కట్టి, కాంగ్రెసు నాయకులు మహాదేశభక్తులుగా వెలిగిపోతున్నారు. ఆ పాపపు మూటలో కాంగ్రెసువారి వాటాను బహిర్గతపరచటానికి తన పాకిస్తాన్ ప్రసంగాన్ని చర్చనీయాంశం గావించాలని అద్వానీ ప్రయత్నించాడుగానీ, సంఘపరివారీయులు దాన్ని ప్రోత్సహించలేదు. జిన్నాను పొగడటం అద్వానీ ఉద్దేశ్యం కాదు. పాకిస్తాను రాజ్యాంగ నిర్ణాయక సభకు అధ్యక్షునిగా జిన్నా చేసిన గొప్ప ప్రసంగం నుండి లౌకిక పాలనా విధానం గురించి అద్వానీ ఉల్లేఖించింది- భారతదేశం జిన్నా చెప్పిన లౌకికవాదాన్ని పాటిస్తోందనీ, పాకిస్తానే పాటించకుండా 'మత' రాజ్యంగా మారిందనీ చెప్పటానికి మాత్రమే! పాకిస్తాన్‌లో మిలిటరీ పాలనలను ప్రక్కనబెడితే, ఎన్నికల తంతులో కూడా (ఇటీవల బలూచిస్తాన్ రాష్ట్రంలో తప్ప) మతవాద పార్టీలు రాజకీయాధికారాన్ని చేపట్టలేకపోయాయన్న వాస్తవాన్ని మనదేశంలో కప్పిపుచ్చుతున్నారు. జిన్నా చెప్పిన లౌకికవాదం భారతదేశంలో అమలుజరిగిందనటం అబద్ధం. లౌకికవాద ద్వేషులయిన భాజపేయులు కాంగ్రెసు తరహా కుహనా లౌకికవాదాన్నే లౌకికవాదంగా ప్రచారం గావిస్తున్నారు. వీరు పాకిస్తాను, బంగ్లాదేశ్‌లలోని మతఛాందసత్వాన్ని వేలెత్తి చూపించేది, అది కూడదని కాదు. హిందూత్వ పేరుతో, మెజారిటీ మతం సాకుతో తమ మతతత్త్వ ఫాసిస్టు అణచివేతలకు ప్రజామోదాన్ని పొందటానికి మాత్రమే!

11.8.1947 నాటి జిన్నా ప్రసంగంలో నుండి కొద్ది వాక్యాలు:

"కాలక్రమంలో మెజారిటీ, మైనారిటీ మతస్తులూ, హిందువులు, ముస్లిములు అనే చట్రాలు (ANGULARITIES) అంతరించిపోతాయి.

"మీరు స్వేచ్ఛాజీవులు. మీ మీ దేవాలయాలకు, మసీదులకు, మరే యితర ప్రార్థనా స్థలాలకైనా పాకిస్తాను దేశంలో స్వేచ్ఛగా వెళ్లవచ్చు. మీరు ఏ మతానికీ, కులానికీ, తెగకు చెందినవారైనా సరే రాజ్యంకు ఆ వ్యవహారంతో సంబంధం లేదు.

"కాలక్రమంలో, రాజకీయార్థంలో హిందువులు హిందువులుగానూ, ముస్లిములు ముస్లిములుగానూ వుండరు. వ్యక్తిగత విశ్వాసమైన మత విషయంలో తప్ప అందరూ పాకిస్తాను దేశపు పౌరులుగా వుంటారు"!

జిన్నా ఉపదేశాలను పాకిస్తాను పాలకులు అమలుజరపలేదనీ భారతదేశంలో అమలుజరిగిన లౌకికవాదమంతా జిన్నా చెప్పినదేనంటూ అద్వానీ ఆత్మవంచనాత్మక ప్రసంగం చేశాడు. కానీ భారత దేశంలో ప్రజాస్వామిక నిర్మాణానికి కీలకమైన ఎన్నికల ప్రక్రియలో కులాన్ని, మతాన్ని వినియోగించుకోగల సంపన్నవర్గాలే విజేతలు కావటం

సర్వసాధారణ నియమంగా వుంది. ఆర్థిక, రాజకీయ సంక్షోభం తీవ్రతరమౌతున్న కొద్దీ కులతత్వాన్ని ప్రోత్సహించటం మతాభిమాన, ద్వేషాల్ని రెచ్చగొట్టడం పాలకవర్గ పార్టీల స్వభావంగా వుంది. ప్రజల నిరసన, పోరాటాల్ని పక్కదారి పట్టించటానికీ, ప్రజల్ని సంఘటితం కానివ్వకుండా చీల్చడానికి అవి సాధనాలుగా వున్నాయి. ఈ తరహా కుహనా లౌకిక ఆచరణనే సర్వధర్మ సమభావంగా పరిపాలక వర్గాలు బోధిస్తున్నాయి. దీనినే లౌకికవాదంగా ముద్రించి సంఘపరివార్ శక్తులు ప్రచారం చేస్తూ లౌకికవాద ద్వేషాన్ని, మెజారిటీ మతోన్మాదతత్త్వాన్ని వ్యాప్తిచేస్తున్నాయి.

పాకిస్తాను జాతీయగీతాన్ని ఒక హిందువు (జగన్నాథ్ అజాద్) చేత జిన్నా రాయించాడు. మహమ్మద్ ఇక్బాల్ రాసిన "సారే జహా సే అచ్ఛా" పాటను హిందూస్తాన్‌కు జాతీయగీతంగా పెట్టుకోలేకపోయారు. నిజానికి 'వందేమాతరం', 'జనగణమన'కన్నా "సారె జహా సే అచ్ఛా" అర్థవంతమైన, సందర్భోచితమైన గేయం. (గదర్ పార్టీ వ్యవస్థాపకుడు-లాలా హరదయాళ్ -లాహోర్‌లో 1904లో పెట్టిన ఒక సమావేశంలో ఇక్బాల్ మొదటిసారి 'సారే జహా సే' పాడి వినిపించారు.)

మతతత్త్వ మాంత్రిక దండం వదిలి, కుహనా లౌకికవాద జపమాల పుచ్చుకుంటే తప్ప వర్తమాన, రాజకీయ పరిస్థితులలో నెగ్గుకురాలేమని భావించిన భాజపా అధ్యక్షుడు అద్వానీ సంఘపరివారానికి ఆగ్రహం తెప్పించే వ్యాఖ్యలు మరికొన్ని చేయబట్టే కొంత రగడ జరిగింది.

1. బాబ్రీ మసీదును కూల్చివేసిన 6 డిసెంబర్ 1992వ తేదీ నా జీవితంలో అత్యంత విషాద దినం.
2. పాకిస్తాను ఏర్పాటు వెనక్కు తిప్పలేని చారిత్రక వాస్తవం.
3. అవిభక్త భారత చరిత్రలో ఎన్నో సామ్రాజ్యాలు, వంశాల చేతుల నుండి రాజ్యాధికారం బదలాయింపు జరిగినా, 1947 నాటి దేశ విభజనలో జరిగిన విధంగా మానవ మారణహోమంగానీ, లక్షలాది మంది ఒక చోటు నుండి మరొక చోటుకి బదిలీ అవటంగానీ జరగలేదు.
4. భారత-పాకిస్తాన్‌లు సోదర దేశాలు. చర్చల ద్వారా తప్ప శాంతియుత సంబంధాలను నెలకొల్పుకుని కొనసాగించలేము.

బాబ్రీ మసీదు కూల్చివేత పథక రచన, ముస్లిములపట్ల విద్వేషపూరిత కార్యాచరణయింది. హిందువులను రెచ్చగొట్టటం ద్వారా తప్ప...అద్వానీకి హోం మంత్రిపగ్గాలు దొరికేవే కాదు. మాంత్రిక దండం తిప్పకుంటూ, రాజ్యభూతానికి ముస్లిం మతస్తులను బలిహారం గావిస్తూ రథయాత్రలతో, కరసేవలతో దేశాన్ని అల్లకల్లోలం చేస్తే తప్ప ఆనాడు భాజపాకు అధికారం లభించలేదని తెలియనిదెవరికి? భూమండలీకరణ (గ్లోబలైజేషన్) అనే బుల్‌డోజర్ -దేశాన్ని నేలమట్టం చేస్తుంటే ప్రక్కదారి పట్టించటానికి 'కమండలీకరణ' మంత్రాన్ని భాజపేయులు పఠించారని కూడా అందరికీ తెలుసు. గుజరాతులో రాజకీయ అంతః సంఘర్షణలను అధిగమించటానికీ, తిరిగి అధికారంలోకి రావటానికీ -గోధ్రా సంఘటనను వాడుకున్నారు. ఆనాటికి (2002) గుజరాత్ గవర్నరుగా వున్న శ్రీ సుందర్‌సింగ్ భండారీ, (ఆరెస్సెస్సుకి మాజీ నాయకుడు) తన (తరువాయి 57వ పేజీలో)

బొల్లిముంత శివరామకృష్ణ సంస్మరణలో

# నేటి తరానికి స్ఫూర్తి, భావితరాలకు ఆదర్శం బొల్లిముంత

- శ్రీకాంత్

ఆయన తెలుగు సాహితీ లోకంలో నిశ్శబ్ద విప్లవం!

నిప్పుల ఉప్పెనను నిండుగుండెలో నిక్షిప్తం చేసుకున్న శాంతి సాగరం!!

నిరాడంబరంగా, నిగర్వీగా, మౌనంగా, శాంతంగా సాహిత్య, సామాజిక రంగాలలో తనదైన విశిష్ట వ్యక్తిత్వంతో జీవితకాలమంతా ముందుకు సాగిన మార్క్సిస్టు గాంధీ!

ఆయనే బొల్లిముంత శివరామకృష్ణ. 1920 నవంబరు 27వ తేదీన గుంటూరు జిల్లా వేమూరు మండలం చదలవాడలో అక్కయ్య, మంగమ్మ దంపతులకు జన్మించిన శివరామకృష్ణ గుంటూరులో హయ్యర్ గ్రేడ్ ట్రెయినింగ్ పూర్తిచేసుకొని స్వగ్రామంలో రైతుల పిల్లలకు విద్యాగంధం అందించడానికై తన తండ్రి నెలకొల్పిన పాఠశాలలోనే భావిభారత పౌరులకు ఓనమాలు దిద్దించారు. అపరిమితమైన జ్ఞానదృష్టిలో సంస్కృతాన్నీ, సంగీతాన్నీ స్వయంకృషితో నేర్చుకున్నారు. నాటకాలకు సంగీతం సమకూర్చడమేగాక, స్త్రీ పాత్రలను సైతం ధరించారు.

ఆనాడు ఆంధ్రదేశంలో ఉప్పెనగా ముసురుకున్న కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరి భావజాలం ఆయననూ విడిచి పెట్టలేదు. ఆ ప్రభావంతో ఆత్మగౌరవ నినాదంతో స్వకుల పౌరోహిత్యం నెరపడానికి 'సచ్ఛాస్త్రి'గా జందెం తగిలించుకోజూసిన సమయమది.

ఆ సమయంలో త్రిపురనేని గోపీచంద్‌తో స్నేహం ఆయన జీవితాన్ని మలుపు తిప్పింది. గోపీచంద్ అందించిన మాగ్జిం గోర్కీ నవల 'అమ్మ'ను ఒకటికి పదిసార్లు పఠించారు. దానిలో తన జీవిత లక్ష్యం అవగతమైంది. ఒకవైపు వైదిక ఆచారాలను ఖండిస్తూ, అవే ఆచారాలను తెలుగులో 'వివాహవిధి' పేర నెత్తికెత్తుకొనడం, వారికంటె ఒక అక్షరం హెచ్చుగా 'సచ్ఛాస్త్రి' అనే పేరు తగిలించుకొని, యజ్ఞోపవీతం ధరించి శూద్రబ్రాహ్మడిగా అవతారం ఎత్తడం మంచిదికాదనుకున్నారు. అపరిమితమైన పఠనాసక్తితో, అపూర్వమైన పరిశీలనాశక్తితో అధోజగత్సహోదరుల కష్టాలనూ, కన్నీళ్ళనూ, బాధలనూ, జీవిత గాధలనూ, తమను క్రూరంగా అణిచివేస్తున్న సమాజంపై వారి ఆవేశాన్నీ, ఆక్రోశాన్నీ, అక్కసునూ అనుభవైక వేద్యం చేసుకొనడానికి వ్యవసాయ కార్మిక సంఘంలో పనిచేయ నారంభించారు. కమ్యూనిస్టు రాజకీయాలతో మమేకమైనారు. 1945లో ఉపాధ్యాయ వృత్తికి వీడ్కోలు చెప్పి, భార్యాబిడ్డల పోషణ భారాన్ని తండ్రి అక్కయ్యపైవేసి, పూర్తికాలం సమాజ శ్రేయస్సుకోసం, దళిత ప్రజల సమస్యల పరిష్కారంకోసం వెచ్చించడమేగాక, సాహితీ వ్యవసాయం ప్రారంభించారు.

తన 16వ ఏట 'చిత్రాంగి' పత్రికలో ప్రచురితమైన 'ఏటొడ్డు' కథతో ప్రారంభమైన రచనా జీవితం 2005 జూన్ 7వ తేదీన ఆయన కన్ను మూసే పర్యంతం కొనసాగింది.

చల్లపల్లి జమిందారుకు వ్యతిరేకంగా సాగిన పోరాటంలో స్వయంగా పాల్గొన్నారు. 'భూమికోసం, భుక్తికోసం, దాస్యనిగళ విముక్తికోసం, సాగిన తెలంగాణా రైతాంగ సాయుధ పోరాటంలో తుపాకీ పట్టి పాల్గొన్నారు. ఆ పోరాట అనుభవాలతో 'మృత్యుంజయులు' నవల రాశారు. తెలుగు సాహితీ లోకంలో నిబద్ధతతో, నిమగ్నతతో వ్రాసిన తొలి రాజకీయ నవల అదే. నిజాం నిరంకుశ, రాక్షస పాలనకు వ్యతిరేకంగా పోరాడిన రైతుబిడ్డల జీవిత కావ్యం అది. ఆ చారిత్రక పోరాటాన్ని సజీవంగా తెలుగు పాఠకులకు అందించిన శివరాం మృత్యుంజయుడైనాడు.

నెహ్రూ ప్రభుత్వం కమ్యూనిస్టులపై క్రూరనిర్బంధకాండను అమలుజరిపిన కాలంలో అజ్ఞాతవాసం అనుభవిస్తూనే గుంటూరు నుండి 'నగారా' పత్రికను నడిపారు. కారుమంచి వెంకటేశ్వరరావు సంపాదకత్వంలో వెలువడిన ఈ పత్రికకు అజ్ఞాతవాసంలో వున్న శివరామ్ 'డిఫాక్టో సంపాదకుడు. ఆనాడు నెహ్రూ ప్రభుత్వం స్వదేశంలో కమ్యూనిస్టులపై దారుణమైన నిర్బంధకాండను ప్రయోగిస్తూ, దొరికిన వారిని తుపాకీ తూటాలకు ఎరవేస్తూ, మరోప్రక్క సోషలిస్టు శిబిరంలో స్నేహ సంబంధాలకోసం అర్రులుచాచే ద్వంద్వ విధానాన్ని తూర్పారపడుతూ "మొదళ్ళు నరికి చివుళ్ళకు నీరుపోస్తానంటాడు పండిట్ నెహ్రూ" అని రాసిన వ్యాసం పాఠకులలో ఆలోచన రేకెత్తించింది.

అలాగే సాహిత్యంలో సైతం అవకాశ వాదాన్నీ, దిగజారుడుతనాన్నీ ఆయన ఏ మాత్రం సహించలేదు. నలభయవ దశకంలో తెనాలిలోనే పురుడుపోసుకున్న అభ్యుదయ రచయితల మహోద్యమంలో భాగస్వామిగా వుంటూ కొడవటిగంటి కుటుంబరావు రాసిన 'పిల్లి' కథపై 'నగారా' పత్రికలో విరుచుకు పడ్డారు. "ఆంధ్రదేశంలో అభ్యుదయ రచయితల సంఘం పురోగమన యాత్ర. అందులో కొడవటిగంటి తిరోగమన పాత్ర" అంటూ బృహద్వ్యాసం రాశారు. దానిపై పెద్ద చర్చ సాగింది. తన కథను పుచ్చలపల్లి సుందరయ్య మెచ్చుకున్నాడంటూ కొడవటి గంటి ఎదురు దాడికి దిగారు. సాహిత్యం రాజకీయ నాయకుల మెరమెచ్చులకు అతీతమైనదనీ, ఎవరు మెచ్చుకున్నా తప్పు తప్పేగానీ ఒప్పుగాదనీ, పిల్లి మ్యావ్ అన్నంత మాత్రాన అది 'మావో' అన్నట్లుగాదని, పిల్లి విప్లవకారునికి ప్రతీక కాదనీ బొల్లిముంత సునిశితమైన విమర్శ చేశారు. సాహిత్యంలో స్వపక్ష, పరపక్ష పొగడ్తలు, తెగడ్తలకు తావులేదని నిరూపించారు. అందుకే సాహిత్య లోకంలోని 'పరస్పర పొగడ్తల సంఘాలకు' ఆయన 'పెద' మనిషిగా గోచరిస్తారు. చివరకు 'నగారా' పత్రికను సైతం ప్రభుత్వం నిషేధించింది.

ఆయన సాహితీస్రష్ట. జనంకోసం, సమాజ హితంకోసం కలం పట్టారు. ఆయన చేపట్టని ప్రక్రియ లేదు. బెంగాల్ కరువుపై బుర్రకథ రాశారు. రైతుబిడ్డ హరికథ రాశారు. 'సూక్ష్మంలో మోక్షం', 'అంతరాత్మ అంత్య క్రియలు' కథా సంపుటాలు. వీనిలోని కథలు కొన్ని 'శివరామకృష్ణ కథలు' పేరుతో అచ్చయినాయి. 'ఏ ఎండకా గొడుకు', 'పత్రికా న్యాయం' 'తెలంగాణా స్వతంత్ర ఘోష', 'క్విట్ కాశ్మీర్', 'ధర్మ సంస్థాపనార్థాయ' మున్నగు నాటికలు, 'రాజకీయ గయోపాఖ్యానం', 'రాజకీయ కురుక్షేత్రం' పద్య నాటికలు, 'దొంగ దొరికింది', 'బలేమంచి చౌకబేరం' రేడియో నాటికలు రాశారు. 'నేటి భారతం' పేరుతో మూకీ నాటిక రాశారు. ప్రజా నాట్యమండలి పునరుద్ధరణ సమయంలో బొల్లిముంత, శ్రీకాంత్ కలిసి రాసిన 'అందరూ

బతకాలి' నాటకం రక్తకన్నీరు నాగభూషణం వందకుపైగా ప్రదర్శనలిచ్చారు.

1955 ఆంధ్రదేశంలో మధ్యంతర ఎన్నికల సమయంలో కాంగ్రెస్‌కు నీలం సంజీవరెడ్డి, కమ్యూనిస్టు పార్టీకి తరిమెల నాగిరెడ్డి నాయకులు ఇద్దరూ నిజజీవితంలో బావామరుదులు. వీరిని ప్రధాన పాత్రలుగా ఎంచుకొని ' రాజకీయ కురుక్షేత్రం'. 'రాజకీయ గయోపాఖ్యానం' రాశారు. 'కురుక్షేత్రం'లో 'జెండాపై కపిరాజు' పద్యం ఎంత ప్రాచుర్యం పొందిందో 'రాజకీయ కురుక్షేత్రం'లో 'జెండాపై కత్తి, సుత్తి' పద్యంసైతం ఆనాడు ప్రజల జిహ్వాగ్రాల మీద నాట్యమాడేదని అత్యుక్తిగాదు.

1945 ప్రాంతంలో ఆనాటి ఉమ్మడి కమ్యూనిస్టు పార్టీ పత్రిక 'ప్రజాశక్తి'లో బొల్లిముంత కథ 'దేశం ఏం కావాలి' అచ్చయింది. ఈ కథలో జైలు నుంచి విడుదలై స్వగ్రామం వెళ్ళే జాతీయవాది చక్రపాణి. స్వగ్రామంలో తనకు ఎదురైన కల్తీ కాంగ్రెస్‌వాళ్ళను చూసి దిమ్మెరపోయాడు. "కాంగ్రెస్ జెండాను మూడుసార్లు లాక్కు పోయి, చివరకు తగులబెట్టిన రౌడీ వెంకయ్య, తాను జైలులో వుండగా అమ్మ తిండి గింజలకు అవ్వు అడిగితే'కొడుకు పోయాడుగా స్వరాజ్యం చేయడానికి. వచ్చే దాకా ఉపోసాలుంటే ఈ వారా ఆవారా స్వరాజ్యంలో ఎక్కువగా తినొచ్చుగా' అంటూ వెక్కిరించిన షాహుకారు నారయ్య. కల్లు దుకాణం వద్ద పికెటింగ్ చేస్తుంటే దౌర్జన్యం చేసిన సోములు, పేద రైతులకు ఉచితంగా పొలం కొలిచిపెట్టినందుకు కారాలూ, మిరియాలు నూరిన బాపినీడు, మాల మాదిగలను అంటుకున్నాడని వెలిబెట్టిన పెత్తందారు వీళ్ళంతా కాంగ్రెస్‌వాళ్ళయ్యేసరికి విస్తుపోయాడు చక్రపాణి. 'ఎంత మార్పు' అని. తర్వాత అర్థమయ్యింది. బీదాబిక్కిని పిండి పిప్పి చేసే సరుకంతా కమ్యూనిస్టులకు పోటీగా ఖద్దరు వేషం ధరించారు. వేషం మారినా బుద్ధులు మారలేదని చక్రపాణి బుర్రలో తుపాను. కలత నిద్రలో చెడ్డకల..' తుళ్ళిపడి లేచాడు. ఆ దడలోనే 'దేశం ఏం కావాలి?' అని అనుకున్నాడు. ఇదీ కథ. దీనిపై కీ.శే. తుమ్మల వెంకట్రామయ్య సుదీర్ఘ సమీక్ష రాశారు. "ఏమండోయ్ శివరాం గారి కథలోని చక్రపాణిగారూ! మళ్ళీ ఎప్పుడూ 'దేశం ఏం కావాలి' అని ప్రశ్నించకండి. వాళ్ళు (అంటే కాంగ్రెస్ నామదార్లు) 'దేశమా? అదేం సరకు. బ్లాక్‌లో అమ్మితే గిట్టుబాటుం టుందా?" అని అడిగినా అడుగుతారు అంటూ కీ.శే. తుమ్మల తమ సమీక్షలో ముక్తాయింపు యిచ్చారు.

1955 మధ్యంతరంలో కమ్యూనిస్టు పార్టీ వస్తుందనుకొన్న రాజ్యాధికారం కోల్పోయి దిమ్మదిరిగే దెబ్బతిన్నాక తెనాలి తాలూకా కమ్యూనిస్టు పార్టీలో సైతం విద్వేషాలూ, కార్పణ్యాలూ పెచ్చరిల్లాయి. రెండుసార్లు శివరాంపై హత్యాప్రయత్నం జరిగింది. ఎవరు చేయించారన్నది చిదంబర రహస్యం. పార్టీని 'పోషించగల సత్తా'వున్న కొందరి పెత్తందారీ తనం పెరిగింది. ఈ పెత్తందారీ తనానికి ఎదురొడ్డిన బొల్లిముంత 1960లో ప్రజా రంగాన్ని వదలి మద్రాసు సినిమారంగం చేరారు. ఆచార్య ఆత్రేయకు 'ఘోస్ట్'గా 'కలిసివుంటే కలదు సుఖం', 'కలిమిలేములు' లాంటి ఎన్నో చిత్రాలకు రచన చేశారు. చివరకు ఆత్రేయ దర్శకత్వంలో వెలువడిన 'వాగ్దానం' చిత్రానికి సహరచయితగా తెరపై కెక్కారు. నాటి నుండి వెనుదిరిగి చూడలేదు. బి.ఎస్.నారాయణ దర్శకత్వం వహించిన చిత్రాలన్నింటికీ బొల్లిముంత సంభాషణల కర్త.

ఆయన సినిమాలకోసం ఎవరినీ యాచించి ఎరుగరు. ఆనాడు చిత్రసీమలోని

ఏ గ్రూపులో కలిసి ఎరుగరు. అందుకే శివరాం కావాలనుకున్నవారు మాత్రమే ఆయన్ను వెతుక్కుంటూ వచ్చేవారు. 1967లో తిరిగి తెనాలి వచ్చేశారు. అదే సంవత్సరం జరిగిన పార్లమెంట్ ఎన్నికల్లో బందరు స్థానం నుండి పోటీ చేయాలని సి.పి.ఐ. ఆదేశించింది. సి.పి.ఐ. చీలిపోయి రెండు పార్టీలుగా (సి.పి.ఎం., సి.పి.ఐ.) అవతరించిన తరువాత వర్గశత్రువు మీద పోరుకంటే ఉభయ పార్టీల మధ్య పోరు ఎక్కువగా వుండేది. దీనినే 'దాయాది పోరు' గా ఆనాడు ప్రజలు చెప్పుకునేవారు. ఆ ఎన్నికల్లో ఆయన తరపున నేనూ (శ్రీకాంత్), జి.వి.నారాయణ ప్రచారకులం. సి.పి.ఎం. పార్టీ అభ్యర్ధి మోటూరి హనుమంతరావు, చల్లపల్లి జమీందారు వద్ద గతంలో కొంతకాలం ఉద్యోగం చేశారు. జమీందారు వద్ద ఉద్యోగం వెలగబెట్టిన వ్యక్తే జమీందారుకు ప్రత్యర్థి ఎలా అవుతారనేది మా ప్రచారంలో ప్రధానమైన ప్రశ్న. ఏమైతేనేం. పిట్టపోరూ, పిట్టపోరూ పిల్లి తీర్చినట్లుగా ఆ ఎన్నికల్లో ఉభయ కమ్యూనిస్టులను ఓడించి చల్లపల్లి జమీందారే నెగ్గారు. ఇంతకూ ఆ ఎన్నికల్లో మేము ఖర్చు చేసిన మొత్తం రెండు వేల రూపాయలు. దానికి 20 రెట్లు ఎక్కువగానే మాకు ఓట్లు వచ్చాయి.

1968లో విశాలాంధ్ర విజ్ఞాన సమితి 'ప్రతిభ' పేరుతో సచిత్ర వారపత్రికను ప్రచురించింది. దానికి సహాయకుడిగా బొల్లిముంత, నేనూ (శ్రీకాంత్) పనిచేశాం. 1969లో వి.మధుసూదనరావు, బొల్లిముంతను మద్రాసు రమ్మని టెలిగ్రాం యిచ్చారు. ఆయన తిరిగి మద్రాసు వెళ్ళడానికి సుముఖత వ్యక్తం చేయలేదు. తెనాలికి చెందిన కామ్రేడ్ ఈదర సాంబశివరావు, నేనూ కలిసి బలవంతాన బొల్లిముంతను మద్రాసు బండి ఎక్కించాం. అది 'మనుషులు మారాలి' సినిమా. ఈ సినిమా విడుదలైనప్పుడు పంపిణీదార్లు నాలుగైదు రోజులకంటె ఎక్కువ ఆడదని పెదవి విరిచారు. వాళ్ళ అంచనాను తలక్రిందులుచేస్తూ ఆ సినిమా వంద రోజులు ఆడడమేగాదు. శోభన్‌బాబుకు, శారదకూ 'స్టార్‌డం' తెచ్చిపెట్టింది. ఆ సినిమాలో శివరాంగారి మాటల పదునుకు అటు పత్రికా లోకం, ఇటు ప్రేక్షక లోకం జేజేలర్పించింది. శివరాం మాటలనూ కత్తులూ, ఈటెలుగానేగాక అవసరమైతే ఆటం బాబులుగాసైతం ప్రయోగించగలడన్న ఖ్యాతి నార్జించారు. అప్పటి నుండి వి.మధుసూదనరావు దర్శకత్వం వహించిన సినిమాల్లో అత్యధికభాగం సినిమాలకు శివరాంగారే పని చేశారు. ఆయన రాసిన దాదాపు 50 సినిమాల్లో 'మనుషులు మారాలి', 'ప్రజా నాయకుడు' లాంటి సినిమాలేగాక 'శారద', 'కళ్యాణమంటపం', 'మూగకు మాటొస్తే', 'విచిత్రబంధం'లాంటి సెంటిమెంట్ ప్రాధాన్యంగల సినిమాలకూ రాసి శహభాష్ అనిపించుకున్నాడు.

తదనంతరం సినిమారంగంలో అనూహ్యమైన మార్పులు వచ్చాయి. కథకూ, పఠనానికీ ప్రాధాన్యత తగ్గి 'హీరోఏక్షన్' పెరిగింది. ఫలానా హీరో కాల్షీట్స్ యిస్తే చాలు కథ అవసరంలేదనే స్థితికి సినిమారంగం చేరింది. ఈ దశలో శివరాం మౌనంగా సినిమారంగం నుండి నిష్క్రమించి తన స్వగ్రామం చదలవాడ చేరుకున్నారు. అయినా సాంస్కృతిక రంగంలో ప్రజా నాట్యమండలికి అవసరమైన ప్రతి నాటికనూ, ప్రహసనాన్నీ రాసి ఇస్తూ, సి.పి.ఐ. శ్రేణులను సమైక్యపరుస్తూ శేషజీవితం గడిపారు.

బొల్లిముంత శివరామకృష్ణ జీవితాన్ని విశ్లేషించదలిస్తే-

ఒకనాటి బడిపంతులు. నాటకాల హార్మోనిష్టు. స్త్రీ పాత్రధారి.

రాజకీయ నాయకుడు. సినిమా రచయిత. సాదా, సీదా రైతుబిడ్డ, శ్రమనే నమ్మిన యోధుడు, నిజాయితీకి, నిర్భీకతకూ, దండి గుండెకూ, నిండు మనసుకూ ప్రతీక.

మాటలను కుత్తుకలు కోసే కత్తులుగా, గుండెలో చీల్చే వ్యంగ్య విభవంతో ఉపయోగించగల నేర్పరి. తెలుగు పదానికి రంగు, రుచి, వాసన వున్నదని సాహితీ రంగంలో రుజువు చేసిన మహోపాధ్యాయుడు.

ఆయన నేటి తరానికి స్ఫూర్తి; భావితరాలకు ఆదర్శం. ❖



గల్పిక:

## వెనుకడుగు

ఇసుక వేసినా రాలనంత జనం. సూది పడినా వినపడేటంత మౌనం.

ఒక ఉపన్యాసకుడు ప్రజల సమస్యలు, వారు పడుతోన్న కష్టాలు, అందుకు కారణాలు, నివారణ మార్గాలు సూటిగా వివరించుతోన్నాడు.

అయితే....బురఖా కాంగ్రెసువాదులు అని పదే పదే వాడుతున్నాడు.

వినీ వినీ-అక్కడి సామాన్యులకు ఓ అనుమానం తోచింది. అందులో ఒకడు గభీమని లేచాడు.

"అయ్యా! మీరు ప్రతిసారీ 'బురఖా కాంగ్రెసువాది' అంటున్నారే! అర్థం-?"

"నిజమైన కాంగ్రెసువాది కాదని, కాంగ్రెసు ముసుగు వేసుకొన్నాడని-"

"ఓహో! అలాగా? మీరింకో అడుగు వెనకున్నారన్నమాట. ఈ రోజుల్లో కాంగ్రెస్ అంటేనే బురఖా కాంగ్రెసు అని మా అర్థం. మా అనుభవం-కానివ్వండి-"

- బొల్లిముంత శివరామకృష్ణ

గల్పిక:

## పాపభీతి

"ధర్మములలోకల్లా భూతదయ సర్వోత్కృష్ట మైనది". పిల్లవాడు కంఠతా పెడుతున్నాడు పాపం-

తల్లి వింటూ భూతదయ మీద మనస్సును లగ్నం చేస్తోంది.

బయట జోరున వాన కురుస్తోంది.

ముష్టి ముసిల్ది వానలో తడిసి ముద్దై వడవడ వణుక్కుంటూ వరండాలోకి చేరింది.

"ఎవత్తెవే? వరండా పాడుజేస్తూ-పో-"

"పడుకోనీలే అమ్మా! పాపం-వాన"

"దొంగముండ్రా...సర్లే! పడుకోవే".

పాఠం మహాత్యం పనిజేసింది.

"ఏనాటి కర్మో! ఒక్క ముద్దేనా దొరకలా".

"వూనూరుమంటూ మాకెందుకా వుసురు. పో ముందు. పోతవా..."

"అయ్యో-తల్లీ" ముసిల్ది 'ఉస్సురు' మంటూ చీకట్లో కలిసి పోయింది-

పిల్లవాడు ఆవులించి 'భూతదయ'ని మూసేశాడు-

- బొల్లిముంత శివరామకృష్ణ

కథ

# సమ్మె పిలుపు

**బొల్లిముంత శివరామకృష్ణ**

**నాలుగు** రోజులనుంచి, వరుసాగ్గా, ముసురు పట్టి నేలంతా చితచితలాడి పోతోంది. ఆ జారుడుతో భద్రంగా కాలుదీసి కాలుపెడుతూ నడుస్తోంది ఎర్రి. తైల సంస్కారంలేక జెఱుదుబ్బులా రేగిన తల, ఎడమ చంకలో తట్ట, తట్టలో నుంచి పైకి తొంగిచూస్తోన్న చీపురు, కుడి సందిట్లో వీపు మీదుగా కట్టుకున్న అడ్డాలలో బిడ్డ, కుడిచేతిలో చిన్న బొక్కెన- పైగా నిండు గర్భిణీ కూడానాయె. నడవలేక నడవలేక

*పాకీదొడ్లు శుభ్రంచేసి, మలాన్ని నెత్తిన బెట్టుకొని, పట్టణాలను శుభ్రం చేసే పాకీ కార్మికుల గురించి తెలుగు కథానికా సాహిత్యంలో వచ్చిన కథలు చాల తక్కువ. ఆనాటి పాకీ పనివారి గురించి శివరామకృష్ణ రాసిన కథ ఇది.*

నడుస్తోంది. అచ్చుగా పెద్ద గడ్డిబండిలాగా కన్పడ్డది. ఆ తెల్లవారగట్ల మసకచీకట్లో-

బయల్దేరడం అయితే అందరితోపాటే బయల్దేరింది. కాని-ఆ వూరి బైట మాగాణి పొలాల్లోంచి మస్తరు వేసుకునే చోటికి ఆ సరంజామానూ, ఆ మాత్రపు దేహాన్ని యీడ్చుకొచ్చేసరికి అన్నీ ఐపోయినాయి. తాను పనిలో ప్రవేశించినాక ఏ నెలా పూర్తిజీతం తీసుకొనేలేదు. మరీ క్రిందటినెల జీతమంతా జరిమానాలక్రిందే పోయింది.

"ఏడు తిరగమారకతలికే పాపిట్టి కడుపొత్తంటే ఎట్టా సచ్చేట్టురా బగమంతుడా" అనుకుంటూ మేస్త్రీ ఎదురుగుండా నిలబడింది.

భారతదేశం సంతానానికి ప్రఖ్యాతమనీ, అలాంటి సంతాన భాగ్యాన్ని అలా అనుకోడం ఘోరతప్పిదమనీ, పాపం! ఆ పాకీపని చేసుకునే దానికేం తెలుస్తుంది?

"చంకనోపిల్ల-కడుపులోపిల్ల-పో! త్వరగా ఫో!" అన్నాడు మేస్త్రి.

ఆ గొడ్డుమోతు మేస్త్రి చూపుల్తోనే తన సంతానాన్ని మింగుతున్నాడా! అనిపించింది ఎర్రికి-

"బుడ్డదానికి నాలుగునాళ్ళ నుంచీ కాక తగుల్తుందండీ" అన్నది ఎర్రి-

చీదరగా వొకసారిచూచి "సరేలే పో!" అన్నాడు మేస్త్రి.

ఎర్రి వెనక్కు తిరిగింది. అసలు ఆ మిడిగ్రుడ్లు మేస్త్రీని చూస్తేనే తనకు భయం. ఏం మాట్లాడేటట్టు?

తట్టలో ఆకులు లేవు. ఎత్తి తట్టలోవేసే అసహ్యమంతా యిక ఎర్రి మీదే వుంటది.

"ఒపలేని మడిసిని. ఒంగుతా లేత్తా అరవై దొడ్లు చేసేదెట్టా?" అనుకుంటూ కాలు కొంచం సాచివేస్తూ పోతోంది.

రోడ్డుమీద పెంచలగాడు కర్రచీపురు బుజానికానించుకుని, ఏరుకున్న బీడీలను చిరుగులపంచలో చుట్టి రొంటిని దోపు తున్నాడు.

"ఇంత యాలకెల్తే యాడన్నా యెంగి లాకులుంటయ్యా? బేగిపా, పెద్దగాడిద కొడుకేం జేత్తుండడు. గుడిసె లోపటజేరి కప్ప కాళ్ళకి తాళ్లుపోసి ఆడుకోకపోతే యిట సావబెట్టకపోయా?" అన్నాడు.

ఎర్రి కొంచం కాలు జాడించింది. ఏ హోటలు దగ్గర చూచినా వట్టి ఆకులే.

"దొంగ నంజలు. అప్పుడే తుడుసుకు పోయుండ్రు" అంటూ హోటలు హోటలుకూ తిరిగింది.

చివర కొక సందులో హోటలు గోడ క్రింద, గంజిగుంట ప్రక్కగా ఆకులకుప్ప కనపడ్డది. ఏముంది? ఒకటి, రెండు ఆకుల్లో అల్లపు పచ్చడి తప్ప- ఎర్రిలాంటివే ఏ కుక్కలో నాకివేసి పోయాయి.

"హుం! యీ రేసనింగురోజుల్లో మెతుకు లేదుంటాయి. కుక్కలే అల్లాడిపోతుంటేని-" అనుకుని పచ్చడి తీసి నాలుకకు వ్రాసు కుంటూ మిగతా పచ్చడి బొక్కెనలోనూ, ఆకుల తట్టలోనూ వేసుకుని బయలుదేరింది.

ఆ వేళ దొడ్లన్నీ పూర్తయేసరికి ప్రొద్దు నెత్తిమీది కొచ్చింది. రోజూ అలవాటే ఐనా ఆ రోజు మురుగుడు మూలాన్నో యేమో! ముక్కులు బద్దలు కొట్టుకుపోయాయి. దారిలోనే తల బద్దలు కొట్టుకుపోవడం సాగింది.

"తొలింబరంగా సెలవెట్టితే మలిదినాల్లో కట్టం. ఆ సెలవ రోజుల్లోనన్నా బుడ్డాణ్ణియేత్తే సరిపోతది. దానికి అపీసరుగోరికి పది రూపాయలు ముడుపు కట్టుకోవాలె. వచ్చే పది అట్టాపోతే-"

గుడిసెలోకి పోయిచూస్తే ఎవరూ లేరు. ఒక మూల గోనెపట్టా మీద మునగ దీసుకుని పడున్నాడు మామ కుష్ఠురోగంతో.

మామ కాళ్ళూ, చేతులూ చూస్తే ఆ వేళ ఎందుకనో భయం వేసింది. తన చేతులూ, కాళ్లూ అలానే అవుతాయి. ఈ రోజు తన చేతుల్తో తాను అన్నం దినే రాతలేదు. ఇంట్లో ఎవ్వరూ లేరు. పిల్ల ఎటో ఆడటానికి పోయింది. పెద్ద బుడ్డాడు సరేసరి. మొగుడు 'పెంచలు' ఎటుబొయ్యాడో? బొంగున జూస్తే బుట్టలేదు.

"పీతల పట్రాను పోయుండుగామాలు. తెల్లారింది మొదలేసుకుని పను కుంగిందాక పొట్ట దేవులాటకే సరిపాయె".

చంకలోనే నిద్రబోయిన బిడ్డని ఒక ప్రక్కని పడేసి ఆ గుడిసే ఆ గుడిసే తిరిగి ఓ అమ్మను పట్టుకొచ్చింది. "రాయే! యీయాలింత కూడు తినిపిద్దుగాని- యీ సేతుల్తో తిన రోతేత్తండది" అని-

"యీముండదిందిట్లో-యియిగో" కుండ పైకెత్తి చూపించిందాయమ్మ.

"ఉండకానింతా పెద్దగున్న దిని ఏ గుట్టలకో సచ్చిండు. ఆటలకి-"

ఆ కానిని మెతుకుల్లోనూ తాను తెచ్చుకున్న అల్లపు పచ్చడి కలిపి యింత నోట్లో వేయించుకున్నది.

ఆ సాయంత్రం "నాగాపడితె ఆసిర్లే" అని పోలేక అల్లాగే గుడిసెలో పడుంది. పెంచలు మాత్రం బుట్ట గుడిసెలో పారేసి డ్యూటీ కెళ్ళాడు. ప్రొద్దుకూకే వేళకు తిరిగివచ్చాడు.

పీలికలు పీలికలుగా వ్రేలుకాడుతోన్న ఆ చేతుల్లేని నల్లచొక్కా మీద ఎర్రటి చీటి వుంది.

"ఓలయ్యో! తెల్లారితే సమ్మె". ఆ చీటీ రోజూ చూస్తూనేవుంది ఎర్రి. కాని యీ వేళ ఎందుకనో గాబరాపడ్డది. తాను రేపూమాపట్లో ప్రసవించబోతోంది. ఎంతలేదన్నా ఐదు రూపాయలు ఖర్చు. ఆ పాడు గుడిసెకే అద్దె కూడా కట్టాలి. క్రిందటి నెల జీతమంతా కోతలక్రిందే పోయింది. జీతం మాత్రం ఎంత జీతం? తొమ్మిది రూపాయలు; కరువుదో పదారు; మొత్తం పాతిక-తన జీతం గూడా కలిపి, అన్నీ సరిగ్గావస్తే యాభై. ముసలాడు, తాను, పెంచలు, ముగ్గురు పిల్లలు, ఏ మూలికి యీ కరువు రోజుల్లో, ఇప్పుడు సమ్మెజేస్తే

ఎట్లా? పోయి ఖాతాదారు కోనప్ప కాళ్ళ మీద పడాలి.

కోనప్ప జ్ఞాపకం వచ్చేటప్పటికి కొయ్య బారిపోయింది ఎఱ్రి. క్రిందటి నెల వాడిదగ్గర తీసుకున్నది 10 రూపాయలు- రూపాయికి బేడా కాడికి పది బేడలు రూపాయి పావలా నెలచెర్లేసరికి ముందుగానే జీతంలో తీసుకుంటాడు! "అమ్మయ్యో!" మొగుడికి దగ్గరగా వచ్చి "ఒరే మామ! నువ్వుగూడా సమ్మెకడతవురా?"

"ఓ! కట్టక- తస్సాదియ్య! పాతికేళ్ళ మట్టి పనిజేత్తావుంటే యేటికి రూపాయికాడికన్నా పెంచకపోతే!"

"సమ్మె సెయ్యమాకరా! నేను రేపోమాపో నీల్లాడుతాను".

"ఓయ్! నీల్లాడు- పొల్లాడు. సమ్మెచేసి చూపిత్తా".

"అదిగాదురా. కర్మ సూసుకుందావా?"

"తాలుండిశ. లెక్కని నలభై దొడ్డులంట; శెయ్యబోతే ఎనభై దొడ్లు. సత్తావుంటేను-"

"ఇనిపిచ్చుకో కాత్త- పని వూడుద్ది-"

"నీ తాత తల్లోపేను దిగిరావాల. తెల్సా?"

"ఓడాయిరుక్కునేది? కడుపున కనుకున్న బిడ్డకి చెయ్యడానికే తల్లి ఎరుసుద్దే. అట్టాంటిది మనం మట్టిదిని యేలుకుయేలు చేత్తావుంటే- ఓడే ఆ కనికారంలేని యదవ నాయాలు".

"కోటప్ప గాడిపని సూశావా? ఏమైందో- పనిలేక తిరుగుతుండాడు. సేతులో డబ్బున్నా వుంటే-"

"అందుకే-యాడాదికి నెలజీతం బోణాను రావాల. సరైన పనిముట్టా యియ్యక..."

త్రాగున్నాడేమోనని మెదలకుండా పోయింది ఎఱ్రి.

"చూసుకో. యీ దెబ్బతో-! పెద్ద పెద్దోరంతా జీతాలు పెంచుకోడమున్నూ-"

సమ్మె నోటీసివ్వడానికిపోయిన రోజున తాను కూడా ఊరేగింపులో వెళ్ళింది ఎఱ్రి. సంఘం పెట్టుకున్న తర్వాత మేస్త్రీల మామూళ్లు, ఆఫీసరు గారింట్లో అరవచాకిరీ, తప్పిపోయిందన్న సంగతి మరచిపోలేదు. కాని... రాబోయే ప్రమాదాన్ని కొండలా తలచుకొంటూంటే-యిప్పుడవన్నీ అంతగా పనిచెయ్యడంలేదు. ఆ రాత్రల్లా ఆలోచనల్తోనే నిద్రబోయింది. మర్నాడు ఉదయం ఆలస్యంగా నిద్రలేచింది.

అప్పటికప్పుడే-పెంచలు మేదరబుట్ట తీశాడు. పెళ్ళినాటి బట్టలు కాలవకట్ట మీద బుడబుక్కలవాళ్ళ దగ్గర కొన్నవి తీసికట్టాడు. బయల్దేరబోతున్నాడు.

గభాలునవచ్చి కావిటేసుకొంది ఎఱ్రి.

"ఉండొశె. పిచ్చిముండ! పంటసేను వొదిలి పరిగ యేరుకుంటావంట. సమ్మె నాలుగురోజుల కట్టానికి జడిసి, సచ్చిందాకా కట్టపడమంటావంట. లే! వొదులు. నేనొక్కణ్ణే నంటే-వొదులు" అని విదిలించుకుని గుడిసెలోనుంచి బయటపడ్డాడు. చంటి దాన్నెత్తుకుని తానూ బయటికి వచ్చింది.

గూడెంకు తూర్పు ప్రక్కగా మామిడి తోపులో సూర్యుడు వుదయిస్తూ అందంగా ఎఱ్రగా వుంది.

రండోయ్! రండోయ్! పేదల్లారా!
పోరాడ్దాం మన హక్కులకై
..............................
పోయేదేముందోయ్ మనకింకా
పోతే యీ పేదరికమేనోయ్!
..............................
ఉక్కుముక్కలుగ ఒక్కుమ్మడిగా
పోదాం రండోయ్ పేదల్లారా!

రంయ్యిన ఆ అన్ని రకాల గొంతులూ ఒక్కసారిగా మోగాయి ఒక్కటిగా.

ఎఱ్రి అలా చూస్తూనే ఆ గుంపుతో వెళ్ళిపోతోంది.

గుడిసెలో పడున్న మామ చెవుల్లోసైతం అదే ధ్వని గింగిర్లెత్తుతూ వుంది. ✳

- 'శివరామకృష్ణ కథలు' (విశాలాంధ్ర) సౌజన్యంతో

వ్యాసం:

# బొల్లిముంత గారి రాజకీయ పద్యనాటికలు

- దివికుమార్

**భరతుని** నాట్యశాస్త్రం వర్తమాన కథా వస్తువుని నిషిద్ధంగా పరిగణించింది. దానికి కారణమొక కథగా చెప్పారు. అదేమంటే ఒకసారి దేవతలు "క్షీరసాగర మథనం" నాటకాన్ని ప్రదర్శిస్తూ రాక్షసులకు శ్రీ మహావిష్ణువు అమృతాన్ని దక్కకుండా చేయటం న్యాయమేనన్నట్టుగా కథను నడిపిస్తుండగా ఆగ్రహించిన రాక్షసులు నాట్యవేదికపై దాడిచేసి, విధ్వంసం సృష్టించారట. అందుచేత వర్తమానం వివాదాస్పదంగా వుంటుంది కనుక అందులోకి కళాకారులు తలదూర్చవలదని నాట్యశాస్త్రం ఉపదేశించింది. కానీ గతాన్ని వివరించినా, భవిష్యత్తుని కల్పించినా వర్తమానంలో వినియోగం కాకుండా వుండేది, నిరుపయోగ నిర్జీవ కళ అయితీరుతుంది.

సమకాలీన వివాదాలన్నిటిలోకి రాజకీయ వివాదం అత్యంత తీవ్ర సంక్లిష్టభరితమై వుంటుంది. వాటిపైన, వాచ్యంగా, అన్యాపదేశంగా, ప్రతీకలతో చెప్పటం వేరు. సమకాలీన రాజకీయాలను, సమకాలీన సజీవ రాజకీయ పాత్రలతో చిత్రించి ప్రదర్శింపజేయటం వేరు. రచయితకు తనదైన రాజకీయపు మొగ్గు వుండినా సంఘర్షణలో నువ్వా, నేనా అన్నట్టు తూకాన్ని నింపకపోతే కళా విలువలులేని ప్రదర్శనై వెలవెలపోతుంది. ఏకపక్షంగా సాగే క్రీడ ప్రేక్షకుల్ని ఆకట్టుకోలేనట్టే నాటక సంఘర్షణలో తగు తూకం లేకపోతే ప్రదర్శన పేలవమైపోతుంది. ఇందులో రచయిత యొక్క రాజకీయ పరిపక్వత, సంస్కారం కూడా మిళితమై వుంటాయి.

కామ్రేడ్ బొల్లిముంత శివరామకృష్ణ 1953లో "రాజకీయ గయోపాఖ్యానం", 1954లో "రాజకీయ కురుక్షేత్రం"ను రచించగా ఆనాటి ప్రజానాట్యమండలి బృందాలు వీటిని ప్రదర్శించాయి. ఈనాటి కోస్తా జిల్లాలు రాయలసీమ ప్రాంతమంతా ఆనాడు ఉమ్మడి మదరాసు రాష్ట్రంలో భాగంగా వుండేవి. తిరువాన్కూరు సంస్థాన ప్రాంతం వారు కాని మళయాళీలు, తమిళులు, తెలుగువారితో కూడినదీ ఉమ్మడి మదరాసు రాష్ట్రం. తెలుగువారికి ప్రత్యేక పాలనా ప్రాంతం వుండాలని 1913 బాపట్లలో జరిగిన తొలి ఆంధ్ర మహాసభ నాటి నుండీ ఆంధ్రులు కోరుతూ వచ్చారు.. 1917లో కలకత్తాలో జరిగిన అఖిల భారత కాంగ్రెసు మహాసభలో కరమ్‌చంద్‌గాంధీ వ్యతిరేకించినా బాలగంగాధరతిలక్ ఆశీస్సులతో తెలుగు ప్రతినిధులు ప్రత్యేక తెలుగు రాష్ట్రపు తీర్మానం చేయించగలిగారు. చివరికి పొట్టి శ్రీరాములు గారి ఆత్మార్పణ (15.12.1952)తో గానీ ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం (1.10.1953) ఏర్పడలేదు.

అప్పటికొక పది సంవత్సరాలుగా బ్రిటీషాంధ్రా ప్రాంతంలో కమ్యూనిస్టు ఉద్యమం ఉరుకులు పరుగులుగా ఉవ్వెత్తున చెలరేగింది. కాంగ్రెసు ప్రభుత్వాలు అమలు పరిచిన భయంకరమైన పళనియప్పన్ నిర్బంధకాండను చవిచూచింది. నిజాం

వ్యతిరేకంగా ప్రారంభమైన తెలంగాణా ఉద్యమం రైతాంగ సాయుధ పోరాటంగా, దున్నేవానికే భూమి విశాలాంధ్రలో ప్రజారాజ్యం నినాదంగా ఎగసి, కాంగ్రెసు మిలిటరీకి వ్యతిరేకంగా కూడా 3 సంవత్సరాలు సాగింది. 1952 ఎన్నికలలో అటు నిజామాంధ్రలోనూ, ఇటు ఉమ్మడి మద్రాసులోని ఆంధ్రాలోనూ ఊహించనన్ని అసెంబ్లీ పార్లమెంటు సీట్లు కమ్యూనిస్టులు సాధించారు. భారతదేశం మొత్తంలోనే అత్యధికమైన ఓట్లను కమ్యూనిస్టు అభ్యర్థి రావినారాయణరెడ్డి పొందారు. కోస్తా జిల్లాల్లో కాంగ్రెసులో ప్రముఖ నాయకులైన కళా వెంకట్రావు, బెజవాడ గోపాలరెడ్డి, కల్లూరి చంద్రమౌళి, వేముల కూర్మయ్యల్లాంటివారే కమ్యూనిస్టుల చేతుల్లో ఓడిపోయారు. తరిమెల నాగిరెడ్డి జైలులో వుండి కూడా ఆనాటి ప్రముఖ కాంగ్రెసు నాయకుడు నీలం సంజీవరెడ్డిని ఓడించారు. వారిద్దరూ కృష్ణార్జున బంధుత్వం కంటె బలీయమైన బంధువులు. ఒకరి చెల్లెల్ని మరొకరు పెళ్లి చేసుకున్న (కుండ మార్పిడి) బావా-బావమరిదిలు. నీలం సంజీవరెడ్డి అనంతపురంజిల్లాలో తరిమెల నాగిరెడ్డి చేతుల్లో ఓటమికి గురైన తర్వాత, జీవిత కాలంలో అనంతపురంజిల్లా నుండి ఎన్నికల్లో పోటీ చేయలేదు. చిత్తూరుజిల్లా శ్రీకాళహస్తి నియోజకవర్గ కాంగ్రెసు సభ్యుని (బలరామిరెడ్డి) చేత రాజీనామా చేయించి, సంజీవరెడ్డిని గెలిపించి అసెంబ్లీకి పంపారు. కర్నూలుని ఆంధ్ర రాష్ట్ర రాజధానిగా నిర్ణయించారు. తెలుగువారి చెన్నపట్నం పూర్తిగా తమిళులపరమైంది.

రాజధాని విషయంపై కాంగ్రెసు-కమ్యూనిస్టుల నడుమ వివాదం చెలరేగింది. రాయలసీమ కమ్యూనిస్టులు కూడా గుంటూరు-బెజవాడ నడుమ రాజధాని ఉండటం వల్లే అందరికీ యోగ్యంగా వుంటుందని వాదించగా, కోస్తా కాంగ్రెసు నాయకులు కూడా కర్నూలే రాజధానిగా వుండాలని కోరుకున్నారు. ఆనాటికి గుంటూరు-బెజవాడ ప్రాంతంలో కమ్యూనిస్టులది పైచేయి కావటం అన్నది రాజకీయ సమస్యగా వున్నది. కర్నూలుపై "డేరా రాజధాని"గా ఎద్దేవా జరుగుతుండేది.

కాంగ్రెసు పార్టీలో చీలికలున్నాయి. ఆచార్య రంగా, టంగుటూరు ప్రకాశం, గౌతు లచ్చన్నలాంటి ప్రముఖులు ఆధిపత్య ఘర్షణల ఫలితంగా నాడు కాంగ్రెసు వెలుపల వున్నారు. అయితే కాంగ్రెసు-కమ్యూనిస్టులే ప్రజల భావి నిర్ణేతలుగా వున్నారు. ఆనాటి కాంగ్రెసు నాయకుడు నీలం సంజీవరెడ్డి, ప్రతిపక్ష నాయకుడు ఆయన బావమరిదే అయిన తరిమెల నాగిరెడ్డి.

ఆనాటి రాజకీయ సంఘర్షణను పద్య నాటిక "రాజకీయ గయోపాఖ్యానం"గా బొల్లిముంత శివరామకృష్ణ రాశారు. దానికి మూలం కృష్ణార్జునుల మధ్య తీవ్ర ఘర్షణగా సాగే గయోపాఖ్యానం నాటకం. దీన్ని చిలకమర్తి లక్ష్మీనరసింహం రాశారు. కోస్తా, రాయలసీమ జిల్లాల్లో 'గయోపాఖ్యానం' నాటకానికి చాలా ప్రాచుర్యం వుంది. ఒక కళారూపంగా పద్యాన్ని ఆస్వాదించే గుణం పల్లెలలో ఈనాటికీ వుంది. లయతో కూడిన పద్యపు నడకే మాత్రా ఛందస్సు. యతి ప్రాసలు శబ్దగాంభీర్యాలనిస్తాయి. చిలకమర్తి వారి గయోపాఖ్యాన్ని -ఒక్క సమకాలీన రాజకీయాల జోడింపులో తప్ప-మొత్తంగా అనుకరించిన కళారూపాలే బొల్లిముంతగారి రాజకీయ నాటకాలు. ఆయన కొంతకాలం హార్మోనిస్టుగా పద్యనాటకాలకు వాయిద్య సహకారం అందించి వుండటంచేత పద్యం నడక మీద ఆయనకు పట్టు వచ్చింది. కమ్యూనిస్టు ఉద్యమంతో పెనవేసుకుని

వుండటం, రాజకీయ పరిజ్ఞానం పొంది వుండటంచేత చెప్పదలుచుకున్న భావాన్ని బలంగా వ్యక్తం చేయగలిగారు.

రాజకీయ గయోపాఖ్యానంలో నీలం సంజీవరెడ్డి-తరిమెల నాగిరెడ్డి ఇరువురే వుంటారు. సంభాషణగా- పద్యాల రూపంలోనే వారి మధ్య రాజకీయ ఘర్షణ సాగుతుంది. స్వకులస్తునిగా, రక్తబంధువుగా, రాయలసీమ వాసిగా...ఎన్నో విధాల నాగిరెడ్డిని తనవైపుకు తిప్పుకోవాలని సంజీవ రెడ్డి ప్రయత్నిస్తాడు. ప్రజా ప్రయోజనం ప్రాతిపదికన తప్ప సంజీవరెడ్డితో ఏకీభావమన్న సమస్యేలేదని నాగిరెడ్డి జవాబిస్తుంటాడు. మధ్య మధ్యలో గత రాజకీయాలపై ఎగతాళి, వ్యంగ్యాస్త్రాలు కూడా చోటు చేసుకుంటాయి. రాయలసీమకు కర్నూలు రాజధాని చేయటంవల్లకాదు, నీటి ప్రాజెక్టులు నిర్మాణంవల్ల మాత్రమే అభివృద్ధి సాధ్యపడుతుందని చాలా స్పష్టంగా నాగిరెడ్డి వాదిస్తాడు. అయిననూ అసెంబ్లీ తొలి సమావేశం 1953 నవంబరు 23న కర్నూలులో నిర్ణయమౌతుంది. బలా బలాలను కర్నూలులో తేల్చుకుందామనే సవాళ్లతో 16 పేజీల గయోపాఖ్యానం ముగుస్తుంది.

ఇక రెండవది "రాజకీయ కురుక్షేత్రం". ఇది 1955 ఉప ఎన్నికలలో ప్రచార నిమిత్తం రాశారు. కురుక్షేత్ర యుద్ధాన్ని ఎన్నికలుగా భావించి దానికి ముందు కృష్ణుడు జరిపిన రాయబారాన్ని అసెంబ్లీలో అవిశ్వాస తీర్మానపు చర్చగా ప్రతిక్షేపించారు. రాయబారంలో జరపవలసిన చర్చలను, పట్టు విడుపులను, ఆవేదనలను (ఉద్యోగపర్వం) కలబోసుకుని పాండవులూ, ద్రౌపదీ కృష్ణునితో సంభాషించిన సంఘటనను అసెంబ్లీలో కమ్యూనిస్టు నాయకుడైన తరిమెల నాగిరెడ్డి (కృష్ణుడిలా), కొందరు సభ్యులు (ధర్మయ్య, భీమయ్య, అర్జునుడు)తో కార్యక్రమ నిర్ణయాన్ని చర్చించుకొనటంతో నాటకం మొదటి అంకం ప్రారంభమవుతుంది.

బీడు, బంజరు భూముల, సాగుదార్లను భూమి నుండి తొలగించరాదనీ, కూలి పనులు లేక వలసలు పోవాల్సిన దుస్థితిని తొలగించటానికి సాగునీటి ప్రాజెక్టులు లేకుండినవనీ, వ్యవసాయ కూలీల పోరాటాలను క్రూరంగా అణచివేస్తున్నారనీ, జమీందార్లకు నష్టపరిహారాలిచ్చి సత్కరిస్తున్నారనీ, దున్నేవానికే భూమినిస్తామని కాంగ్రెసువారు కరాచీ మహాసభలో చేసిన వాగ్దానాన్ని అమలు జరుపకుండా ఎన్నికలలో మాత్రం బూటకపు వాగ్దానాలు చేస్తున్నారనీ ప్రజా సమస్యలపై ఆందోళన చేసిన, చేస్తున్న ప్రజలపై, నాయకులపై తీవ్ర హింసాకాండను పోలీసు, మిలిటరీల ద్వారా అమలుజరుపుతున్నారనీ వీటన్నిటి ఫలితంగా ఈ ప్రభుత్వంపై విశ్వాసం లేదని ప్రకటించవలసిందిగా తమ నాయకుడైన తరిమెల నాగిరెడ్డితో సంభాషించటం-మొదటి అంకంగా నడిపారు. కమ్యూనిస్టులు ప్రతిపాదించిన అవిశ్వాస తీర్మానానికి, కాంగ్రెసు అసంతృప్తివాదులు ఓటు వేయటానికి నిరాకరిస్తే...వారు ప్రతిపాదించిన తీర్మానానికి కమ్యూనిస్టులే ఓటు వేయటం మంచిదనే నిర్ణయంతో మొదటి అంకం ముగుస్తుంది.

రెండవ అంకం అవిశ్వాస తీర్మానంపై అసెంబ్లీలో జరిగిన చర్చ. స్పీకరుతో ఇందులో నాగిరెడ్డితోపాటు టంగుటూరి ప్రకాశం, తెన్నేటి విశ్వనాథం, సంజీవరెడ్డి, గౌతు లచ్చన్న, తిమ్మారెడ్డి, పి.వి.జి.రాజు ఉంటారు. పేరుకు టంగుటూరి ప్రకాశం ముఖ్యమంత్రే గాని అంతా సంజీవరెడ్డే నడిపిస్తుంటాడు. తిమ్మారెడ్డి ఆయన క అంటే 'క'కి అంటే 'కి' అంటూంటాడు.

కాంగ్రెసు కురువృద్ధుడైన టంగుటూరి ప్రకాశం కమ్యూనిస్టులు కోరిన బంజరు భూములను పేదలకీయమనీ, అలాగని శాసనసభ తీర్మానమున్నదని బోధించినా సుయోధనుడులాంటి సంజీవరెడ్డి వినడు. పాండవుల తరఫున ఐదూళ్లనో, అర్ధరాజ్యాన్నో కృష్ణుడు కోరింది ఎత్తుగడగానే తప్ప, దుర్యోధనునితత్వాన్ని బహిర్గతపరచటానికే తప్ప మరొకందుకు కానట్టే కమ్యూనిస్టుల బంజరు భూముల డిమాండు అంతటితో సరిపుచ్చుకొనటానికి కాదు. ఈ విషయం సంజీవరెడ్డే ప్రకాశం పంతులుతో చెబుతాడు.

"అయిననూ మీ మాటలు నిరాకరింపక శాసనసభా తీర్మానములను అమలు జరిపితిమే యనుకొనుడు. ఎప్పుడేని వారు మనలను దించుటకై మరల మరల ప్రయత్నించకుందురా?"అని, ఇంకా-

"బ్రిటీషు సామ్రాజ్యవాదుల ఫిరంగుల ముందే నిలబడి రొమ్మిచ్చిన కాంగ్రెసు ప్రతినిధులమై-నేడీ బిక్కాఫకీరులగు ప్రజల సత్యాగ్రహముల ముందు తలవంచి వారన్నదానికెల్లా 'ఔ'నని తలలూపి తల వంపులు తేజాలను. నన్ను మన్నింపుడు" అంటాడు.

అవిశ్వాస తీర్మానాన్ని ప్రతిపాదిస్తూ తరిమెల నాగిరెడ్డిచేత మూడు పద్యాలూ, వాటిని అనుసంధానిస్తూ ప్రసంగ వాక్యాలూ చెప్పించారు శివరామకృష్ణ గారు.

"ప్రజగానని యంధ ప్రభుత్వ జాతి, పోగాలము దాపురించె; కల కాలమునిల్చునె? మాయ సంపదల్" అని మొదలుపెట్టి

"తెలుగు దేశంపు నదీ జలాల్ గొనిపోవ
కృష్ణ-పెన్నార్ కుట్ర బన్నునాడు
తెలుగుదేశపు ప్రజాధనముతోడ పరాయి
ప్రాంతాలనభివృద్ధి పరుచునాడు
'ప్రత్యేక రాష్ట్రమ్ము పనికిరాద'ని కేంద్ర
యధినాధులకు సిఫార్సంపునాడు
తెలుగుదేశమ్మంత మిలిటరీ క్యాంపు
గావించి తమ్ములనె గాల్పించునాడు
నాటి మద్రాస్ ప్రభుత్వమ్ము నాటి నుండి
కారో? వీరలె మంత్రులు-కాని కలదె
తెనుగు దేశ జనాళికి తేని కీడు?
చేసినట్టి యొకానొక చిన్నిమేలు?"

ఈనాడు ప్రత్యేక తెలంగాణావాదులు లేవనెత్తుతున్న సమస్యలే 50 సంవత్సరాలకు ముందు కమ్యూనిస్టుల ప్రతినిధిగా తరిమెల నాగిరెడ్డి లేవనెత్తాడాయన్నట్టున్నది! కానీ మరల మరల అవే సమస్యల్లాంటివి తలెత్తుతున్నాయనేది గ్రహించాల్సి వుంటుంది. భూస్వామ్య బూర్జువా వ్యవస్థ అంటేనే సామాజిక అసమానత్వాలను పెంచే వ్యవస్థ. నూతన ప్రజాస్వామ్యమూ-సోషలిజమూ మాత్రమే అసమానత్వాలను తగ్గించుకుంటూ పోగలిగే వ్యవస్థలు. 1956లో విశాలాంధ్ర (ఆంధ్రప్రదేశ్) ఏర్పడినా ప్రజారాజ్యం నెలకొనలేదు. భూసంస్కరణలు చట్టాల చిట్టాలలో మిగిలి దున్నేవానికే భూమి నినాద ప్రాయమైంది.

జాతుల స్వయం నిర్ణయాధికారం భాషా ప్రయుక్త రాష్ట్రాలకు కుదించబడింది. గుజరాతు రాష్ట్ర ప్రభుత్వం, రిలయన్స్ సంస్థా మన గ్యాసు నిక్షేపాలను నిక్షేపంగా కొల్లగొట్టుకుపోగలిగే స్వేచ్ఛ కలిగి వున్నారు. బహుళజాతి కంపెనీలకు మన మూల్గులను పీల్చే హక్కులు దాఖలు పరచడమై వున్నది.

ఇవన్నీ అసమానత్వాలను పెంపొందించే అంశాలే. అసమానత్వాల పునాదిని తొలగించే ప్రయత్నంలేని ఉద్యమాలు, అధికారపు పంపిణీ ఆధిపత్యపు పోటీ వివాదంగానే ముగుస్తాయి. సంస్కరణలు మంచివేకాని అన్ని సంస్కరణలూ మంచివి కావు. విప్లవానికి దోహదపడే సంస్కరణే సమాజం ముందుకు నడవటానికి దోహదకారవుతుంది.

తరిమెల నాగిరెడ్డి తీర్మానానికి కాంగ్రెసు అసంతృప్తివాదులు ఓటు ఎలా వేస్తారని సంజీవరెడ్డి ఎగతాళితో రెచ్చగొడతాడు. దానికి గౌతు లచ్చన్న తానూ అవిశ్వాస తీర్మానం ప్రతిపాదిస్తున్నానంటాడు. అప్పటికే తాటి కల్లుని కూడా నిషేధించటం సరైనది కాదంటూ ప్రభుత్వం నియమించిన శొంఠి రామ్మూర్తి కమిషన్ యిచ్చిన నివేదికను అమలుపరచమని కమ్యూనిస్టులు, గౌతు లచ్చన్న అనుచరుల నాయకత్వాన కల్లు గీత కార్మికులు పెద్ద ఆందోళన చేసి అనేక మంది జైలు పాలై వున్నారు.

శొంఠి రామ్మూర్తి కమిషన్ నివేదికను అమలుపరచని ప్రభుత్వంపై విశ్వాసం లేదంటూ గౌతు లచ్చన్న ప్రకటించగా... దానిపై ఓటింగు జరిగి ఒక సంవత్సరానికే తొలి ఆంధ్ర రాష్ట్ర ప్రభుత్వం ఓడిపోయింది. అసెంబ్లీలో కాంగ్రెసువారి కంటె ఎక్కువ సీట్లున్నప్పటికీ కమ్యూనిస్టులను మంత్రివర్గం ఏర్పాటుచేసే అవకాశం కల్పించకుండా మధ్యంతర ఎన్నికలను ప్రకటించారు.

మధ్యంతర ఎన్నికలకు ఉభయపక్షాలు సిద్ధపడవలసిన తరుణమొచ్చింది. ఈ క్రింది పద్యాన్ని తరిమెల నాగిరెడ్డితో అనిపించి శివరామకృష్ణగారు రాజకీయ కురుక్షేత్రం నాటకాన్ని ముగించారు.

"ఐనవి సంధి సంబరము లంతిమ
 ఆయుధముండెనొండె, దా
పైనది "దున్నెవారిదె పొలమ్మ"ను ధర్మ
 రణమ్ము; ఏరిక
ర్మాను ఫలమ్మువారిదె, పరాజయమన్నది
 లేదు, మధ్యనె
ట్టైన జనాళికంత్య విజయమ్మును
 శాశ్వత శాంతి నిత్యమౌ"

1955 ఎన్నికలు పెద్ద రాజకీయ సంఘర్షణగా తెలుగువారి చరిత్రలో నిలిచి పోయాయి. అవిశ్వాస తీర్మానాన్ని ప్రవేశపెట్టి బలపరిచిన కొందరు కూడా కాంగ్రెసుతో కలిసి పోటీ చేశారు. భూస్వామ్య ముఠాలన్నీ ఏకమై కమ్యూనిస్టుల్ని ఓడించటానికి కంకణం కట్టుకున్నాయి. తటస్థులు లేనే లేరన్నట్టు హోరాహోరీగా ఎన్నికలు జరిగాయి. "పెట్టుబడికీ, కట్టుకథకు పుట్టిన విషపుత్రిక లంటూ" బూర్జువా పత్రికలపై శ్రీశ్రీ నిప్పులు కురిపించిందప్పుడే. రచయితలు కూడా అటో ఇటో తేల్చి చెప్పాల్సిన పరిస్థితి ఏర్పడితే శ్రీశ్రీ నాయకత్వాన కొందరు రచయితలు కమ్యూనిస్టుల తరపున నిలబడ్డారు. ఆరుద్ర లాంటి వారు కూడా (మోసగింపబడ్డానని తర్వాత చెప్పాడనుకోండి) కమ్యూనిస్టు వ్యతిరేక క్యాంపులో చేరాడు. 1952 ఎన్నికలలో కమ్యూనిస్టులకు 25% ఓట్లు వస్తే, 1955 ఎన్నికలలో 31 శాతం ఓట్లొచ్చాయి. కానీ అంతకు ముందు 40 అసెంబ్లీ సీట్లు 1955 నాటికి 15కు పడిపోయాయి. కమ్యూనిస్టుల్లో కూడా ప్రముఖులయిన చండ్ర రాజేశ్వరరావు (అవనిగడ్డ), తరిమెల నాగిరెడ్డి (గార్లదిన్నె) ఓటమి పాలయారు. కాంగ్రెసు వాదులు ప్రయోగించిన ప్రలోభాలు, కుల, మతతత్వాలూ, బెదిరింపులూ, అణచివేతలూ అన్నీ ఇన్నీ కావు. ఎన్నికలలో డబ్బులిచ్చి ఓట్లు కొనుగోలు చేయటం 1953లోనే మొదల యిందంటారు. ఇన్ని ఒత్తిడుల మధ్య కూడా నూటికి 31 ఓట్లు ప్రధానంగా అట్టడుగు శ్రమజీవులు, కమ్యూనిస్టులకు ఓట్లు వేశారు. అదే ఆనాటి ఎన్నికలలో ప్రదర్శితమైన ప్రజా పునాది.

తర్వాత ఉద్యమాలకు ఈ పునాదిని, వర్గ పోరాటాలకు ఆధారం చేసుకుని వుంటే చరిత్ర మరొక విధంగా ఉండి వుండేది కాబోలు.

ఉద్యమ కళారంగానికి శివరామకృష్ణగారు వ్రాసిన తరహా పద్యనాటికల అవసరం ఎంత తాత్కాలికమైనదైనా వుంటుంది. ప్రజలను ఆకట్టుకుని, ఆలోచింపజేసి, సామాజిక

చైతన్యం కలిగించగలిగించటానికి ప్రాచుర్యంలో వున్న కళారూపాల్ని స్వీకరించటం మంచిదే. రూపం మీద పట్టు రాకుండా సారాన్ని బలంగా వ్యక్తం చేయలేరు. 'రాజకీయ గయోపాఖ్యానం' కంటె, 'రాజకీయ కురుక్షేత్రం' మరింత పరిణతి చెందిన స్థాయిలో వుండటా నికి బొల్లిముంత వారు కళానైపుణ్యపు అభివృద్ధిని సాధించటమే కారణం.

'రాజకీయ కురుక్షేత్రం' (నాటకం) మొదటి ముద్రణ 1955 ఆగస్టులో 10 అణాల ఖరీదుతో జనసాహితి, తెనాలి వారి ఆరవ ప్రచురణగా వెలువడింది. అంతకంటే ముందే 1953లోనే 'రాజకీయ గయోపాఖ్యానం' (కార్టూన్ నాటిక) మొదట విశాలాంధ్రలో ప్రచురింపబడింది. వెనువెంటనే పుస్తకరూపంలో వెలువడింది. ఒక్క నెలలోనే అది ద్వితీయ ముద్రణ పొందింది. మూడవ ముద్రణ 1958 సెప్టెంబర్‌లో 25 పైసల ఖరీదుతో జనసాహితి, తెనాలి వారి ప్రచురణగా వెలువడింది. *

---

కథ

# దేశం ఏం కావాలి?

- బొల్లిముంత శివరామకృష్ణ

**చక్రపాణి** రెండు సంవత్సరాల తర్వాత తిరిగి యీనాడు బాహ్య ప్రపంచంలో కాలుబెట్టాడు. జైలు జీవితం అతని ఆరోగ్యాన్ని పూర్తిగా తినేసింది. బాగా పరిచయం వున్న వాళ్ళకే అతణ్ణి గుర్తు బట్టడం కష్టమయ్యేట్టుంది.

ఆ స్టేషనులో దిగిందల్లా తానొక్కడే. స్టేషన్ మాస్టరుకు టిక్కెట్టిచ్చి, కూజాలోని కొంచం మంచినీళ్ళడిగి పుచ్చుకొని, బల్ల మీద కూచున్నాడు,-ఆకాశాన దూరంగా ఎగుర్తోన్న గ్రద్దల్ని చూస్తూ, ప్రక్క బీట్లో అరుస్తున్న ప్రత్తిరాటపు పిట్టలగోల వింటూ.

స్టేషన్ మాస్టరు తాళంవేసి, లాగిచూచి, తాళంచేతులు త్రిప్పుకుంటూ వెళ్ళిపోయాడు. ఇంకా రెండు మైళ్ళు నడిస్తేనేగాని తాను కొంప చేరలేదు. నెమ్మదిగా లేచి రైలు కట్టవెంటే బయల్దేరాడు. పాణి ఏవేవో మధుర స్వప్నాల నూహించుకుంటూ-

కొంతదూరం నడిచేసరికల్లా కాంగ్రెసు జండాలు గాలిలో రెప రెపలాడుతూ ఎదురు వస్తూన్నాయి.

వెనక తాను పాల్గొన్న నహాయ నిరాకరణోద్యమం బుర్రలో తళుక్కుమంది. ఇలానే బయలుదేరి పికెటింగు చేస్తూ వుండేవాళ్లు. ఒక్కసారిగా అతని కళ్ళముందర కల్లు దుకాణాలు, విదేశీ వస్త్రాలయాలు, కాంగ్రెసు శిబిరం, లాఠీచార్జీలు, అధికారుల వెకిలి నవ్వులు, యింకా యింకా యెన్నో- గిర్రున తిరిగి పోసాగినయ్.

ఆ గుంపు దగ్గరౌతున్నకొద్దీ అతని మనస్సులో కొట్లాట బయలుదేరింది. ఎంత మార్పు!

కాంగ్రెస్ ఉద్యమాన్ని ఆ గ్రామంలో కాలుబెట్టకుండా చేశాడన్న ప్రఖ్యాతితో, పన్ను గఠ్ఠ సంపాయించుకున్న ప్రక్కవూరి మునసబు గారు మొట్టమొదటగా కనబడ్డాడు.

గుంపు యింకా దగ్గరైంది. "చక్రపాణికి జై", "గాంధీకి జై" అన్న నినాదాలు చెవుల్లో గింగురెత్తినయ్. పూలమాలల్తో మెడా, బిడియంతో తలా వంగిపోయి, పూలవాసనను అధిగమిస్తూ క్రొత్త ఖద్దరు వాసన నాసికా పుటల్ని ఉక్కిరిబిక్కిరి చేస్తోంది. అంతా తన

వూరి వాళ్లే. వీళ్ళంతా కాంగ్రెస్ ఉద్యమాన్ని యిలా బలపరుస్తారని తాను కలలో కూడా ఊహించలేదు.

అసలిది నిజమా? కలా?-యిదేదో క్రొత్త ప్రపంచంలాగా వుంది. తనలాంటి క్షుద్రజీవికి-అందులోనూ స్వంత వూరివాళ్లు స్వాగతమివ్వడం-

తనయింటి మీద కట్టుకున్న జెండాను ముమ్మారు లాక్కుపోయి తగలెట్టిన రౌడీ వెంకయ్య భుజాన కాంగ్రెసు జండా! ఉద్యమ ప్రభావం-

అంతా తిరిగి ఊరువేపు నడుస్తున్నారు.

"పాణిబాబూ! చాలా చిక్కిపోయావు. సర్కారోళ్లు మనదేశాన్ని పీల్చుకుతింటమే గాకుండా, నీబోటి కుర్రాళ్ళ రక్తాన్ని కూడా పీల్చుకుతింటున్నట్టున్నారే?"-అన్నాడు షావుకారు నారయ్య.

క్రిందటిసారి తాను జైలుకి వెళ్ళినప్పుడు యింట్లో తిండికి గింజలు లేక తన తల్లిపోయి యీ నారయ్యనే అప్పు అడిగితే-

"కొడుకు పోయాడుగా స్వరాజ్యం చెయ్యడానికి. వచ్చేదాకా ఉపోసాలుంటే, ఈవార అవార స్వరాజ్యంలో ఎక్కువగా తినొచ్చుగా" అన్నాడు. ఆ నారయ్యేనా యిప్పుడు తనని యిలా పరామర్శించడం!?

చక్రపాణి బుర్రంతా యిప్పుడు వచ్చే ఆలోచనల్తో పెద్ద రైల్వే జంక్షన్‌లాగా వుంది. పూర్వ విషయాలు జ్ఞప్తికి రావడంతో కళ్లు స్వయంగా చూచిన విషయాన్నే మనస్సు ఒప్పుకోవడంలేదు.

కల్లు దుకాణం దగ్గర పికెటింగు చేస్తోంటే దౌర్జన్యంగా జండా లాగి పారేసిన గమళ్ళ సోములు-

పేదరైతుకు ఉచితంగా పొలం కొలిచి పెట్టినందుకు కారాలు మిరియాలు నూరిన ప్రైవేట్ బాపినీడు-

మాల మాదిగలనంటుకొంటున్నాడని తనని వెలిబెట్టి, బావినీళ్ళక్కూడా రానీక నానాబాధలు పెట్టిన పెత్తందారు-

యింకా యింకా చాలామంది- ఎంతటి పరివర్తనం!!

ఎండనక వాననక ఖద్దరుమూటలు వీపున వేసుకుని గడప గడపకూ తిరిగిన శ్రమ ఫలించిందా? తన జీవితంలో చూడలేననుకుని నిరాశ చేసుకున్న స్వాతంత్ర్యం వచ్చిందా? అనిపిస్తోంది.

"ఇప్పుడు బహిరంగసభలో మీరు మాట్లాడాలి" అన్నాడు బాపినీడు.

"ఏం మాట్లాడాలో-" తలవంచుకుని అలానే నడుస్తున్నాడు.

ప్రక్కపొల్లాల్లోంచి. 'బోలో స్వతంత్ర భారత్‌కు జై', రైతు సంఘాలకు జై", "కూలి సంఘాలకు జై" అన్న నినాదాలు- వినిపిస్తున్నాయి.

పాణి తలెత్తి చూచాడు. "ప్రజల్లో ఏమి ఉత్సాహం? "ఈ గాడ్దెకొడుకుల్ని ప్రక్కలిర గదంతేగాని" అన్నాడు రౌడీ వెంకయ్య-

"కాంగ్రెస్‌ని వెక్కిరించడం"-అన్నాడు బాపినీడు.

"అళ్ల యెర్రగుడ్డపాటి చెయ్యదు కామాలు మన జెండా".

పాణి కిదంతా అయోమయంగా వుంది. ఇంతకు ముందే అతను తనలోని అనుమానాల నన్నింటినీ దిగద్రొక్కి విజయోత్సాహి అయ్యాడు. ఇంతలో తిరిగి ఇది.

"గమళ్ళ నాగులు మనుమడు కామ్రేడ్ నాగేశ్వర్రావైపోయి వూరికే పెత్తందారాయె. వెట్టి యెంకడి కొడుకుని 'అరే' అంటానికే వీల్లేదాయె. ఊళ్లో అన్ని మంచాలమీద అళ్లే-" అన్నాడు పెత్తందారు.

"అంకిని 'అంకమ్మా' అంటే ఇంకోసారి పిలవయ్యా అందిట. దాని తప్పేముంది?" అన్నాడు ప్రవేటు; తానేదో సమయోక్తి గొప్పగా వాడేశానని-

ఈ మాటల్తో పోటునీరు యధాస్థానానికి పోతున్నట్టయింది, పాణి ఉత్సాహమంతా.

"ఓరి దేవుడా! యీ ముండాకొడుకులు పారిపోతున్న కుల పిశాచాన్ని బలవంతాన కాళ్లగట్టి లాక్కొస్తున్నారులాగుందే"! అనుకున్నాడు.

రైలుకట్టదిగి ఊళ్లోకొచ్చేస్తున్నారు. ఊరిబైటకే కనబడ్తోంది ఎర్రజెండా.

"అదుగో ఆ ఎగిరే ఆవిడనికాస్తా త్రిప్పి రష్యాకు తోల్తేనేగాని పీడవొదల్దు" అన్నాడు మునసబు మౌనముద్రకు స్వస్తి వాచకం చెబుతూ-

అంతా "హిహ్హిహ్హిహ్హి" అన్నారు.

"ఐను జాతీయజండా వుండగా యిది అనవసరమేమో?" అనుకున్నాడు పాణి.

"ఔనా ఎర్రగుడ్డనుజూచి గొడ్డు బెదిరినట్టు బెదురుతారేం వీళ్లు-"

ఊళ్లో-రోడ్డు కుడిచేతి ప్రక్కగ్గా, ఓయింటి ముందు ఎర్రజండా- చాలా మంది పిల్లలు వరనల్లో నిలబడి వున్నారు. యిరవై య్యేళ్ళమ్మాయి:

"దేశమును ప్రేమించుమన్నా-

మంచియన్నది పెంచుమన్నా"

అని పాట చెబ్తూంటే పిల్లలంతా పాడుతున్నారు. శ్రావ్యంగా వుంది పాట. "గురజాడ మహాపురుషుని కీర్తనకు చక్కటి స్వరూపమిచ్చారు.

"లంజలకి పనేముంది? యిడిశేశిన రకం" అన్నాడు రౌడీ వెంకయ్య.

పదిహేనేళ్ళక్రితం పికెటింగు పూర్తయి పోయి, శిబిరానికి వస్తూన్న మహిళా వలంటీర్లనుచూచి, లాంక్షైర్ గుడ్డల్లో వెలిగి పోతోన్న బుర్రమీసాల రాయుడన్న మాటలివే-అచ్చంగా యివే మాటలు!

తిరిగి యీనాడు పొందూరు ఖద్దర్లో మునిగివున్న దేశభక్తుడు కాంగ్రెస్‌జండా భుజాన పెట్టుకుని మరీ అంటున్నాడు- అచ్చంగా అవే మాటలు! వేషం మాత్రం భేదం-

అప్రయత్నంగా "ఛీఛీ" అన్నాడు పాణి.

రౌడీ వెంకయ్యని చాటుగా ఒక్క గిల్లు గిల్లాడు ప్రైవేటు; నాలిక కొరుక్కుంటూ-

పాణికి ఒళ్ళంతా తేళ్లు పాకినట్టయింది. ఒక్కసారి ఆ సమూహంలో నుంచి పారి పోదామా అనుకున్నాడు. వాళ్ళ మొహాలు చూడ్డానికే అసహ్యం వేస్తూంది. తోడేళ్ళ గుంపులో వచ్చిపడ్డ మేకపిల్లలాగ వుంది తనకి.

బహిరంగసభ- మొదటి కర్మకాండంతా ముగిసింది. చక్రపాణి మాట్లాడ్డానికి లేచి నిలబడ్డాడు. జనమంతా తనని అనుమాని స్తున్నట్టు తోచింది. ఏదో పెద్ద తప్పు చేసినవాడిలాగా; "క్షమించండి! వందనాలు- ఊ- ఈ సన్మానం-నాకు కాదు-కాంగ్రెసు సంస్థకు" అన్నాడు.

"బోలో స్వతంత్ర భారత్‌కు జై" అన్నారు అంతా. పాణి అలానే నిలబడి వున్నాడు.

బాపినీడు లేచి "షావుకారు నారయ్యగారి విరాళం ఈ అయిదు వందల రూపాయలు. యిది నిర్మాణ కార్యక్రమానికి" అన్నాడు.

జనంలో నుంచి "దొంగమార్కెట్ నశించాలి!" అన్న కేకలు బయలుదేరాయి.

చక్రపాణి ప్లాట్‌ఫారం దిగి పోబోతున్నాడు. "చూడండి! చూడండి! కమ్యూనిస్టులు సభనెల్లా గల్లంతు చేస్తున్నారో" అన్నాడు మున్సబు.

"దొంగమార్కెట్ చేసేవాడు కాంగ్రెసా? పాణిగారు చెప్పాలి" అంటూ జనంలోనించి కేక వచ్చింది.

"కాదు ముమ్మాటికీకాదు" అంటూ ఒక్కసారి దూసుకుపోయి. గుంపుకెడంగా వున్న కూతుర్నీ, ముసలి తల్లినీ కలుసుకున్నాడు పాణి.

"ఎప్పుడు మీటింగు పెట్టినా యింతే" అన్నది కూతురు. తల నిలువుగా ఊపుతూ

ముందుకి సాగాడు. రౌడీ వెంకయ్య రంకెలు చాలా దూరందాకా వినిపిస్తూనే వున్నాయి.

ఆ రాత్రి భోజమయ్యేలోపల-నారయ్య రూపాయికి మూడుతవ్వల బియ్యం అమ్మడమూ, కుర్రాళ్ళంతా పట్టించడమూ, యిదంతా అర్థమయింది.

"నాన్నా! బ్రిటీషువాళ్లు కంట్రోలు పెట్టారు కాబట్టి దానికి విరుద్ధంగా దొంగమార్కెట్ చెయ్యడం కాంగ్రెసు సిద్ధాంతమటగా!'

నవ్వి ఊరుకున్నాడు పాణి.

"ఏదెట్లా ఉన్నా, ఊళ్ళోవాళ్ళంతా నాగులు మనమడి పట్టే. కాకపోతే బయటపడి కొంప లార్తయ్యేమోననిగాని"-అన్నది తల్లి.

అతని బుర్రలో పెద్ద తుపాను లేచింది. అలానే పడుకున్నాడు. తెల్లవారగట్ట ఏదో కలతనిద్ర. అందులో-జనం బారులు తీరి కూర్చున్నారు. ముందరి విస్తళ్ళనిండా అన్నం- ఒక పెద్ద భయంకర స్వరూపం- దాని వెనక ఇంకా చిన్నవి పది, పదిహేను.

పెద్దపెద్దగా అంగలు వేసుకుంటూ ఆ అన్నం లాక్కొంటున్నాయి. ఒకదూ, అరా, ముద్ద నోట్లో పెట్టుకుంటే, పీకలు నొక్కి కక్కించి మరీ లాక్కుంటున్నై. లాక్కున్న అన్నం పెద్దరాసులుగా పడుతోంది. అప్పటికప్పుడే కొన్ని రూపాయలు చేసి సంచుల కెత్తుతున్నై.

పెద్దభవనం- దాని మీద కాంగ్రెసు జండా ముందు పాణి నుంచుని వున్నాడు.

తిరిగి ఆ భయంకర స్వరూపాలే. అచ్చగా అవే గడ్డాలు పెట్టుకొని పీనుగుల్ని తొక్కు కుంటూ భవనంలోకి వస్తున్నాయి. పాణి అడ్డగించాడు. వాళ్ళ వెనకాడ్డే ఉన్నాడు. యింకో పెద్ద గడ్డాలు, మీసాలు. ఆయన్ని పాణి యెరుగును. ఒకప్పుడెప్పుడో తనకు నాయకుడుగూడా అయినట్టు గుర్తు.

"వాళ్ళనుపోనీ. యిప్పుడవసరం వాళ్ళ తోనే!" అన్నాడు తాను తప్పుకున్నాడు.

అవన్నీ భవనంలోకి వెళ్ళిపోతున్నాయ్. ఒకటి చీలి తన దగ్గరికి వచ్చింది. చేతులు చాచింది. తాను పారిపోబోయాడు. పట్టుకుని రెండు చేతుల్తో పైకెత్తింది. తాను గిజగిజ తన్నుకుంటున్నాడు. వదలకుండా అలానే యెత్తుకుపోతోంది.

భవనంలోవున్న తన అనుచరులందర్నీ అలానే తెస్తున్నాయి తక్కినవి. వాళ్ళూ తన్నుకుంటున్నారు.

ఒక పెద్ద యేటిగట్టు- తాను గట్టిగా కేకలు పెట్టి ఏడుస్తున్నాడు. ఉహూ-ఎత్తి గభీలున ఏట్లో పారేసింది.

తుళ్ళిపడిలేచాడు. ఏమీ లేదు. తన యిల్లే! తన మంచమే! విపరీతమైన దడ.

"దేశం ఏం కావాలి??" అను కుంటున్నాడు, ఆ దడలోనే.

- శివరామకృష్ణ కథలు
(విశాలాంధ్ర) సౌజన్యంతో

---

## ఆగస్టులో చారిత్రక ప్రాధాన్యతగల తేదీలు

- హిరోషిమాపై ఆటంబాంబు 6 .8 .1945
- నాగసాకిపై ఆటంబాంబు 9.8.1945
- బ్రెఖ్ట్ మృతి 14.8.1956
- శారద మరణం 17.8.1955
- కొ.కు. మరణం 17.8.1980
- మఖ్దూం మరణం 25.8.1969
- ఖాజీనజ్రుల్ ఇస్లాం మరణం 28.8.1976
- తెలుగు భాషా దినోత్సవం ఆగస్టు 29

(గిడుగు రామ్మూర్తి జననం)

*



# అజ్ఞాతవాసంలో...

- తిరునగరి రామాంజనేయులు

**1950లో** అనుకుంటాను. తెలంగాణా పోరాటప్రాంతం నుండి, విపత్కర పరిస్థితుల్లో, నేను మంచికలపూడి చేరాను. అక్కడి గ్రామశాఖ నన్ను జాగర్తగా కాపాడింది.

కాని, రెండవనాడే దుగ్గిరాల తెనాలికి సంబంధించిన రిజర్వుడు మూక, మంచికలపూడిని చుట్టుముట్టింది. రాత్రి 9 గంటల వేళ.

మా యింటిప్రక్కనే తోపు. పది మంది గ్రామముఖ్యులు రానే వచ్చారు. అందరమూ సురక్షితంగా తప్పుకున్నాం. పచ్చని సరివి తోటలో, కమ్మగా నిద్రపోయాం.

ప్రమాదం ముంచుకొచ్చేట్లుందని, తాలూకా పార్టీ కార్యదర్శి, బొల్లిముంత శివరాంగారి డెన్నుకు నన్ను చేర్చారు. పార్టీనిషేధంలోనే వుంది. 'నగారా' పత్రికా నిషేధంలోనే వుంది. బొల్లిముంత అజ్ఞాత వాసంలోనే ఇటు పార్టీనీ, అటు 'నగారా'ను నడుపుతున్నాడు. నన్ను ఆప్యాయంగా చేరదీశాడు. అప్పటికే భోజనాలు అయిపోయాయి.

తెనాలిలోనే ఆయన తగుజాగ్రత్తలు తీసుకొని ఉంటున్నారు. ఆయన నాకెంతో ప్రియమైన నాయకుడు. కథలు రాస్తాడు. 'మృత్యుంజయులు' అనే నవల తెలంగాణా నవల. అది చదివి ఆయన్ను మేము గుండెల్లో నింపుకున్నాం.ఆయన మంచి ఉపన్యాసకుడు, గొంతుబొంగురుగా వుండటం కొంత దెబ్బతీసింది. అయినా పాడతాడు. హార్మోనీ వాయిస్తాడు. చక్కని వ్యంగ్య రచనలతో, సమాజానికి చిలిపిగా చురకలంటిస్తాడు మా బొల్లిముంత.

పడకకుర్చీలో ఆయన పత్రిక చూస్తూ కూర్చుంటే, నేను మంచంమీద కూర్చున్నా.

'కామ్రేడ్ రామాంజనేయులు! పటేలు సైన్యాలు వచ్చిన తరువాత పరిణామాలెలా వున్నాయ్' అడిగాడు బొల్లిముంత.

"నేనిక్కడకి చేరేదాక జరిగింది వింటే, మీకే తెలుస్తుంది. చెప్పమన్నారా?"

రెండు రోజులుగా విశ్రాంతి తీసుకున్నానుగదా. హుషారుగానే వున్నా. అందులో పత్రిక ఎడిటరు, వివరంగానే చెప్పదలచాను.

నెహ్రూగారి సైన్యాలు, కమ్యూనిస్టుపార్టీ ఉద్యమాన్ని సర్వనాశనం చేసేందుకే సమాయత్తమైనాయి. దొరికిన ప్రతి కార్యకర్తనూ, పిట్టల్లా కాల్చేస్తున్నారు. యువకులు చిక్కితే కాల్చి, పోగేసి మరీ పారిపోతున్నారు. జనమూ అలసిపోయారు. కొన్ని గ్రామాల నాయకత్వం లోనే, ఉద్యమాన్నుండి తప్పుకునే లక్షణాలు బయలుపడినై. ఆత్మరక్షణ ప్రమాదంలో పడింది.

నెల రోజులు ఇద్దరం కలిసేవున్నాం. మరికొన్ని రోజులు శేకూరు, చలపాడుల్లో గడిపాం. 'నగారా'లో నావి కొన్ని పాటలు వేసేవారు. తెలంగాణా పోరాట నవల 'మృత్యుంజయులు'లోనే కామ్రేడ్ చిరంజీవిగా నిలిచాడు. వారి రచన 'రాజకీయ గయోపాఖ్యానం' వినుకొండలో ఆత్రేయ, శివరాం, నేను కలిసే చూసాం.

ఆయన ఇపుడు కూడా సాంస్కృతిక రంగంలో చేయదగినంత కృషి ఎంతో వుంది. అది అవసరం. *

బొల్లిముంత శివరామకృష్ణ
అభినందన సంచిక (11.7.1982)
సౌజన్యంతో

# నాకు నచ్చిన నా కథ

- బొల్లిముంత శివరామకృష్ణ

వ్యాసం:

కాకిపిల్ల కాకికి ముద్దు అన్నట్టు, కథకుడికి తన కథలన్నీ నచ్చినవే-నచ్చకపోతే యే చిత్తుకాగితాల కట్టల్లోనే పడి వుండేవి గదా- అలా ఎన్నుకోటం క్లిష్ట సమస్యే అనిపించింది మొదట-అయితే కథకుడికి అన్నీ నచ్చిన కథలే గనుక, ఏ కథ అయినా ఒకటే కదా? అని పరిష్కారం దొరికి 'ప్రాణం వెల' అనే కథని తీసుకున్నాను.

చిన్నతనంలో 'చిత్రగుప్త' 'చిత్రాంగి', వినోదినిలాంటి పత్రికల్లో కథలు తెగచదివే వాడిని-అనంతవరంలో చదివే రోజుల్లో అక్కడ కార్మిక సంఘ ప్రచురణల క్రింద అణా ఖరీదుతో చిన్న చిన్న పుస్తకాలు యిచ్చేవాళ్లు, వాటిల్లో "మాతృమూర్తి" అనే పెద్ద కథ (మాగ్జింగోర్కీ అమ్మ నవల 20 పేజీల సంక్షిప్తరూపం) చదివాను. అది నాకు బాగా నచ్చింది. కరుణకుమార కథలు కూడా చాలా చదివాను. అప్పుడు నాకూ కథలు వ్రాయాలనిపించేది ఏం వ్రాయాలో తోచదు. కొన్నాళ్లకు మా ప్రాంతంలో ఒక పాలేరు భార్యని యజమాని బలాత్కరించాడు. జనమూ, ఆమె భర్త కూడా ఆవిడనే తిట్టిపోశారు. "నీవు చనువు యివ్వక పోతే దొరయెందుకు. నీ మీద చెయ్యి వేస్తారు?" అంటూ చితకబాదాడు. నాకు అన్యాయం అనిపించింది. యిదే కథ వ్రాయాలనిపించింది. అయితే నా కథలో స్త్రీ అలా బలికాకుండా ఏం చెయ్యాలి? అతన్ని విదిలించుకుని పారిపోతుంటే భూస్వామి వెంటబడతాడు. అలా పరిగెత్తి పరిగెత్తి చివరకు అడ్డంగా వచ్చిన యేట్లో దూకేసింది. ఆ యేరు కన్నతల్లిలాగా కడుపులో దాచుకుంది. యిది ఆ యేటొడ్డుకు తెలిసినా మాట్లాడలేదు. యిది నా మొదటి కథ 'యేటొడ్డు' శీర్షికతో-'చిత్రాంగి'లో అచ్చయింది.

యిలా కథకి వస్తువు ప్రాణం, అది మనం కన్నవో, విన్నవో, చదివిన వాటిలో నుంచో ప్రేరణ రావచ్చు. అయితే జీవితానికి సంబంధించినదై వుండాలి. మన పూర్వులే విశ్వశ్రేయం కావ్యం అన్నారు. కావ్యానికి ఆశయం విశ్వశ్రేయస్సు అన్నమాట.

నా వరకూ నాకు అనిపించేదేమంటే క్షణం ఆలోచించటానిక్కూడా తీరిక లేకుండా బ్రతుకు పందెంలో పరుగెడ్తున్న జనానికి (పాటక జనానికి, పాఠక జనానిక్కూడా). చుట్టూ వున్న సమాజం ఎంత అధ్వాన్నంగా, అస్తవ్యస్థంగా వుందో చూపే ప్రయత్నం చెయ్యటం రచయితల కర్తవ్యంగా వుంటే బాగుంటుందని నా అభిప్రాయం, అనుభవం కూడా. ఆ పని కథే చేయగలదు. అంతగా వ్యాప్తిలో వున్నది కూడా కథే.

వస్తువు దొరికినా, వ్రాసే శైలి కూడా చదివించగల రీతిలో వుండాలి.

యిక మరో కథ ప్రాణం వెల అన్నది కూడా ఒక సంభాషణ ప్రేరణతో వచ్చింది.

1950-51 ప్రాంతంలో నేను శ్రీకాకుళం జిల్లాలో కొంతకాలం వున్నాను. రెండు గ్రామాల్లో సంగీత పాఠాలు చెప్తుండేవాడిని. రెంటికీ మధ్య నాగావళి యేరు-రోజూ పడవ దాటటంతో పడవ నడిపే వ్యక్తితో పరిచయమైంది. మూడు, నాలుగు రోజులుగా ముసురుపట్టి, నాతోపాటే ఓ వ్యాపారీ వచ్చాడు. కాని యేరు పరవళ్లు తొక్కుతోంది. పడవ వెయ్యటానికి నిషేధం. అప్పుడు ఆ యేట్లో చిన్న చిన్న కొంపలూ, చిన్నా, పెద్దా

కలపదుంగలూ కొట్టుకు వస్తున్నాయి. అది చూచి వ్యాపారికి ఆశ పుట్టింది. వృధాగా కొట్టుకుపోయి సముద్రంలో కలిసిపోతాయే అని లబోదిబో కొట్టుకున్నాడు. పడవ నడిపే అతనికి నాలుగు రోజులుగా తిండిలేదని తెలుసుకున్నాడు. మూడు కుంచాల నూకలు కొలుస్తాను. అవన్నీ అందినంత వరకూ బయటపడెయ్యమని బ్రతిమాలాడు. మరో రెండు రూపాయ లిస్తానన్నాడు. అయితే అతను "చావాలను కున్నాడు తప్ప యీ పోటులో యింకెవరూ దిగడండె" అని తిరస్కరించాడు.

అది నా మనస్సులో కొన్నాళ్ళు కొట్టుమిట్టాడి, 'ప్రాణం వెల' కథ అయింది.

ఆ ఘటనకు (కథకు) వాన లేకపోతే కథేలేదు కనుక వానతోటే ప్రారంభించాను. ఆ ముసురు వల్లా, నది పొంగు తగ్గే వరకూ కూలీనాలీ జనానికి ఎలా పనులు తిండిలేక పోతోందో చెప్పాను. సింహాద్రి గుడిసెలో తల్లి, పెళ్లాం, పసిపిల్లా ఆకలితో యిన్నాళ్లూ ఎలా మారుతున్నారో చెప్పి-

మూడు రోజులాయె, ముసిరి ముసిరి కురుస్తోంది వాన....మాంచి ముమ్మరంగా ఊడ్పులు సాగాల్సిన రోజులు, యీ వాన కూలివాళ్ల నోట్లో ముద్ద పడగొట్టింది.

గుర్రపు పాకలాంటి చిన్నపాకలో ముణగ దీసుకు కూచున్నాడు సింహాద్రి. గోచి మినహా కాసింత గుడ్డ పీలిక కూడా లేదు. ఒంటిమీద వణికిపోతున్నాడు సింహాద్రికి యేటి పొడుగునా పడవ నడపటమే పని. యేటికి అద్దరి యిద్దరి ఆసామిలు గింజలు కొల్లుస్తారు. అది రెండు నెల్ల గ్రాసం. మిగతా తల్లి, పెళ్ళాం కూలి పనులు తోను, కొత్తవాళ్ల దగ్గర వసూలుచేసే పావలా పరక- పైగా ఓ చంటి పిల్లాడు. ముసలి తల్లీ, పెళ్లాం, చంటిపిల్లాడు యీ నాలుగు పొట్టలకే యిన్ని తంటాలు.

యీ మూడు రోజులుగా వాళ్లకి పస్తులే గతి.

సింహాద్రి చప్పునలేచి, విసురుగా బయటికి పోయాడు.

అలా చీకట్లో మునిగిన సింహాద్రి, కోమటి గుర్నాథం కొట్టు ముందు గుడ్డిదీపం దగ్గర తేలాడు.

గుర్నాథం దీపం ముందు చీమతల కాయంత బెల్లం ముక్కపెట్టి ధ్యానంచేస్తూ చెంపలు వాయించుకుని యీ మిధ్యా లోకంలోకి వచ్చి పడ్డాడు.

"యేటి పొడుగునా మీ సేవజేసేటోణ్ణి మల్లాసెయ్యి మెసిల్నాక యిచ్చికుంటాను. ఓ కుంచీరు నూకలు పొయ్యండ"ని చెంగు పట్టాడు.

కుంచీడుగాదు, చిట్టెడు కూడా నా కాడ దొరికేది లేరు" అన్నాడు గుర్నాథం. సింహాద్రి బ్రతిమాలాడు-భంగపడ్డారు.

గుర్నాథం మాటమార్చేందుకు "ఏరు యింకా తీయలేదేట్రా?" అనగా ఏం తీయడం బాబూ ఎగువ నుంచి కొంపలు, మంచాలు, మాకులు, దుంగలు గుణ్ణమేసి కూల్చొ కొత్తన్నాది"

గుర్నాధానికి ఆశ పుట్టింది. "యిట్ట ఆర్నీ యిర్నీ యాచిచ్చకపోతే యేట్లో వూరికే బోయే సరుకు బర్మకు బోయే సరుకు ఒడ్డుకు పట్టిస్తె యెంతరచ్చేనురా-నేను సొమ్ము జేస్తాను" అన్నాడు.

"అట్నే సేద్దాం కానీండి"

యింకెప్పుడురా యీ రెత్తిరి రేత్తరే దిగక-యేరు తీసినాక ఒక్కపుల్లా వుంటదిర-యీ రేత్తిరే పోగై. మూడు కుంచాల నూకలు యిప్పుడే కొలుస్తా -మరో రెండు రూపాయలు చేసుకోమన్నాడు. రేపు యింకో రెండిస్తా నన్నాడు-కొలిచాడు.

ఆ నూకల్తో తిన్నాక, ఏటొడ్డుకొచ్చాడు సిమ్మాద్రి.

చలి యెంత భయంకరంగా వుందో.

భార్య గైరి, పక్క నిలబడి, ఉపాయాలు చెవుతోంది బయటికి. అపాయాలు ఆలోచిస్తోంది లోపల.

సింహాద్రి దిగాడు. ప్రాణాపాయమైన పరిస్థితులతో పోరాడు- కొన్ని కర్రలు ఒడ్డుకు విసిరాడు.

చివరలో ఓ పెద్ద దుంగని పట్టుకో బోయాడు. దాని మీద పాము భయపడి, తప్పుకోబోయేటంతలో దూలం గుద్దింది. సింహాద్రి చావు కేకపెట్టి సుడిగుండంలో పడి కొట్టుకుపోయాడు భార్య ఏటికి ఎగువ దిగువల పడి కేకలు పెడ్తోంది.

తల్లీ, పెళ్లాం గొల్లున గోలబెట్టి యేడుస్తున్నారు.

చూడ వచ్చిన జనం-సిమ్హాద్రి పుణ్యాత్ముడు, చివరికి తనని కాల్చే కట్టెలు కూడా తానే పోగేసుకున్నాడు. యితరులకి రుణం లేకుండా పోయాడు అన్నారు.

ఆ తగలెట్టే చితిని చూస్తు నా 3 కుంచాల నూకల రుణం ఏమయ్యేట్టు అంటూ గుర్నాథం కడుపు ఆ చితికి తోడు మండు తోంది.

యిదీ నాకు నచ్చిన నా కథ.

కథలో కొసరి కొసరి చెప్తూ వాతావరణ సృష్టికి, పెద్ద పెద్ద వర్ణనలు కాకుండా, పాఠకుడిని బోర్ అనిపించకుండా చెప్పుకు పోవటం కథకి ప్రధానమనుకుంటాను.

కాలం చాలా మారింది.

నా కథల్ని నేనే యిప్పుడు చదువుతుంటే స్లో అనిపిస్తోంది.

మారుతున్న సమాజం, మారి, జారి పోతున్న మానవ విలువలు. యేమైనా యిప్పుడే రచయితల కర్తవ్యం చాలా వుందని నా అభిప్రాయం. యిలా మానవ విలువలు, మమతలు కూడా డబ్బు గుప్పిట్లో గిజగిజ లాడుతున్నాయి.

పరోపకారాయ పుణ్యాయ, పాపాయ పరపీడనం ఈ 18 పురాణాలూ చెప్పింది 2 వాక్యాలే. యితరులకి ఉపకారం చెయ్యి. అపకారం చెయ్యకు. - హెల్ప్ ఎవర్, హర్ట్ నెవర్

యిదే మన కథలకి జీవం అయివుండటం మంచిదనీ నా అభిప్రాయం. (అముద్రిత రచన) ❖

# ఒక సవరణ-ఒక వివరణ

- జూన్ 2005 సంచిక సంపాదకీయంలో బెర్లిన్ ఒలింపిక్స్ 1935లో జరిగినట్టు రాశాము. దాన్ని 1936గా సవరించుకోవలసింది.
- జూన్ 2005 సంచికలో రాహుల్ సాంకృత్యాయన్ రచించిన "వోల్గా నుండి గంగాతీరం వరకు" అన్న ప్రఖ్యాత గ్రంథంలోని ఆఖరి కథ 'సుమేరుడు' ప్రచురించాము. తెలుగులోకి పై కథల్ని తొలుత అనువదించిన శ్రీ అల్లూరి సత్యనారాయణరాజు "సుమేరుడు" కథను వదిలేశారు. చాగంటి తులసిగారు చేసిన అనువాదం నుండి మాత్రమే తెలుగు పాఠకులు "సుమేరుడు" చదువుకో గలిగారు. గాంధీయిజం పైన రాహుల్జీ విమర్శను ఆమోదించలేక తొలి అనువాదకులు 'సుమేరుడు'ని వదిలేశారనుకోవచ్చు. ప్రపంచంలో ఏకైక సోషలిస్టు దేశంగా వుండిన సోవియట్ యూనియన్ ఓడిపోకుండా ప్రపంచ పీడిత ప్రజల ఆశాజ్యోతిగా నిలవటం యొక్క ఆవశ్యకతను, 'సుమేరుడు' కథ ద్వారా, ఈనాటి చీకటి కాలంలో బాగా గ్రహించగలుగుతాము. *

వ్యాసం

# మృత్యుంజయులు

## (తెలంగాణ వీరగాధ)- ఒక పరిచయం

- బొర్రా గోవర్ధన్

సాహిత్యం, కళలు ఎవరికోసం? అనేది ఒక ప్రశ్న. కళ కళకోసం అనేది కొందరి అభిప్రాయం. కళ ఆనందం కోసం అనేది ఇంకొందరి జవాబు. కాదు, కళ ప్రజలకోసం అనేది మరికొందరి వాదన. ఈ అభిప్రాయ బేధాలు ఎలా వున్నా కళలు సమాజాన్ని ఉద్ధరించాలి అనేది చాలా ఎక్కువ మంది అభిప్రాయం.

సాహిత్యానికీ, కళలకూ తప్పక ఒక సామాజిక బాధ్యత ఉండాలి అనేది నిర్వివాదాంశం. ఈ కళలు ఎప్పుడు పుట్టాయి? ఎందుకు పుట్టాయి? అని ఆలోచిస్తే పై విషయం చక్కగా బోధపడుతుంది.

...మానవ జీవితాలలోని ప్రతి మలుపులో కొందరు మహానుభావులు తాము సృష్టించిన కళల్ని సామాజిక బాధ్యతతోనే సృష్టించారు.

ఖచ్చితంగా, నూటికి నూరుపాళ్ళు అలాంటి సామాజిక బాధ్యతతో రచించబడిన నవలే ఈ "మృత్యుంజయులు".

భూస్వామ్య, రాచరిక ఉక్కుపాదాల క్రింది నలగిపోతున్న పీడిత ప్రజల్ని మేల్కొలిపి, వారిలో పోరాట పటిమను రగుల్కొల్పడానికి తన అక్షరాల్ని వడిసెల రాళ్ళుగా మార్చి, పీడిత లోకానికి అందించిన రచయిత బొల్లిముంత శివరామకృష్ణ.

తమ అణగారిన జీవితాలను మార్చుకోడానికి 1946 నుండి 1951 వరకూ ఓ అర్ధదశాబ్ద కాలంపాటు తెలంగాణా రైతాంగం సాగించిన వీరోచిత సాయుధ పోరాటానికి అక్షరాయుధాల్ని అందించిన తొలి నవల ఈ "మృత్యుంజయులు".

భారతదేశ చరిత్రలో ఒక అపూర్వ ఘట్టంగా మిగిలిపోయిన ఈ పోరాటం. అజరామరమైనది. ఇటు నిజాం ప్రభువుకు, బ్రిటీష్ సర్కారు సైన్యానికీ, ఆ తర్వాత 'స్వతంత్ర' భారత యూనియన్ సర్కారు సైన్యానికీ వ్యతిరేకంగా, మరీముఖ్యంగా తమ ముంగిట్లో ఉన్న పటేల్, పట్వారీ, దేశముఖుల దురంతాలకు వ్యతిరేకంగా ముప్పేటలా సాగించిన తెలంగాణా ప్రజల వీరోచిత పోరాటాన్ని ప్రపంచానికి చూపిన తొలి దర్పణం ఈ నవల.

తెలంగాణ ఆనాడు నిజాంప్రభువుల పాలన క్రింద ఉండేది. ఆ ప్రాంతంలో దాదాపుగా 90 లక్షల మంది తెలుగు ప్రజలు జీవించేవారు.

తమను పాలించే ప్రభువు నిజాం నవాబు కావడంవల్ల ఆ పాలకుల భాషైన ఉర్దూ వారికి రాజభాషగా ఉండేది. తెలుగుభాష తీవ్ర నిరాదరణకు గురైంది. తెలంగాణా అలా ఉంటే మిగిలిన సర్కారు ప్రాంతం బ్రిటీషు వారి పాలనలో ఉండేది. ఇక్కడ ఇంగ్లీషు రాజభాష. ఇలా రెండుచోట్లా తెలుగుభాష నిరాదరణకు గురికావడంతో మాతృభాషను రక్షించుకోవాలనే ఉద్దేశ్యంతో 1930లో నిజాం రాజ్యంలో ఆంధ్ర మహాసభను ఏర్పాటు చేశారు కొందరు సంస్కర్తలు.

భాషా, సంస్కృతుల పరిరక్షణకోసం ఏర్పడ్డ ఈ మహాసభ పరిధి రాను రాను విస్తరించింది. ప్రపంచవ్యాపితంగా వచ్చిన సామాజిక మార్పులు, విప్లవ పోరాటాలు ఈ సభను ప్రభావితం చేసాయి. సాంఘిక

దురాచారాలతోపాటు, సామాజిక మార్పులకు కూడా శ్రీకారం చుట్టింది. జమీందారీ, జాగీర్దారీ వ్యవస్థలకు వ్యతిరేకంగా ప్రజల్ని చైతన్యపరచి పోరాటాలకు తొలిభూమికను సిద్ధం చేసింది.

ఈ మహాసభలో ఉన్న కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం 1946 నాటికి సాయుధ పోరాటానికి తెలంగాణా రైతాంగాన్ని సిద్ధం చేసింది.

కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన 1946 నుండి 1951 వరకు ఈ ఐదు సంవత్సరాలు-తెలంగాణా రైతులు సాయుధులై దోపిడీ వర్గాలపై తిరుగుబాటు చేశారు. ఈ తిరుగుబాటులో పాల్గొన్న అనేకమంది కవులు, కళాకారులు తమ కళల్ని కత్తులుగా మార్చి ప్రజలకు అందించారు.

"ఏ బండ్లో వస్తవ్ కొడుకో..." అని నైజాం సర్కారోణ్ణి ఎదిరించిన యాదగిరి, ఇంకా సుద్దాల, తిరునగరి, నాజర్, సుంకర, వాసిరెడ్డి, కాళోజీ, దాశరథి, కుందుర్తి, సోమసుందర్, గంగినేని వంటి కవులు, కళాకారులు తమ కలాల్ని కత్తులుగా, గళాల్ని గన్నులుగా మార్చి అక్షరాయుధాలు అందించారు.

గంగినేని 'ఎర్రజెండాలు', వట్టికోట ఆళ్వారు స్వామి రచించిన 'ప్రజల మనిషి, 'గంగు', మహీధర రామ్మోహనరావు రచించిన 'ఓనమాలు', 'మృత్యువు నీడల్లో', అలాగే లక్ష్మీకాంత్‌మోహన్ రచించిన 'సింహగర్జన'-తిరునగరి 'సంగం' నవలలు-ఈ పోరాటాన్ని చిత్రించిన కొన్ని నవలలు.

వీటిలో 'సింహగర్జన' తప్ప మిగిలినవి అన్నీ తెలంగాణా పోరాటం విరమణ తర్వాత వచ్చినవే. అయితే 'సింహగర్జన' కంటే ముందే అంటే దాదాపుగా తెలంగాణా పోరాటం ప్రారంభమైన మొదట సంవత్సరానంతరమే బొల్లిముంత శివరామకృష్ణ 'మృత్యుంజయులు' వెలువడింది.

వీరతెలంగాణా విప్లవ పోరాటం ప్రపంచానికి తెల్పిన తొలి నవలగా చరిత్రలో ఈ నవలకి స్థానం ఉంది. దీనిని ప్రజాశక్తి ప్రచురణాలయం, బెజవాడవారు రూపాయిన్నర వెలతో 25.10.1947న విడుదల చేశారు.

బొల్లిముంత శివరామకృష్ణకి తెలంగాణా పోరాటంలో ప్రత్యక్ష సంబంధం లేకపోయినా, ఆనాటి పత్రికల్లో వచ్చే సమాచారాన్ని బట్టి, తెలిసిన సంఘటల్నిబట్టి ఈ నవల రాశారు. నవలలోని కథాంశం, సన్నివేశాలు ఎంతో సహజంగా చిత్రీకరించారు.

ఈ నవల తెలంగాణాలోని ఓ పల్లెలోని ఓ పేద రైతు కుటుంబం ఇతివృత్తం. ఆ పల్లెకు రచయిత పేరు పెట్టలేదు. కారణం నాటి తెలంగాణాలో ఏ పల్లె పరిస్థితి అయినా అంతే...

దుర్భర దారిద్ర్యంతో, బానిసత్వంతో బ్రతికే కోట్లాది కుటుంబాల్లో మల్లారెడ్డి కుటుంబం కూడా ఒకటి. అతని భార్య రాములమ్మ. మల్లారెడ్డికి నర్సిరెడ్డి, ఎల్లారెడ్డి అనే ఇద్దరు కొడుకులు. రాజమ్మ అనే కూతురు.

ఆ వూళ్ళో పటేల్ పాపిరెడ్డికి రౌడీ ఏజెంట్ అవ్వన్న. దేశ్‌ముఖ్ వెంకటరామ నారాయణరెడ్డి. రైతాంగాన్ని ప్రత్యక్షంగా పీక్కుతినే వాళ్ళు వీరు. వీరిపైన జాగీర్దారు, జాగీర్దారుడైన నిజాం నవాబు. ఇదీ పీడకుల వరుస.

తెలంగాణాలో పొలం అంతా నవాబుది, జాగీర్దారుదీ లేదా దేశ్‌ముఖ్‌ది. రైతాంగానికి సొంతభూమి తక్కువ. అదెప్పుడో అప్పుల క్రింద, తప్పులకు శిక్షల క్రింద దేశ్‌ముఖులకు చేరిపోయింది.

రైతు కుటుంబాలకి రెండెకరాలు, లేదా నాల్గు ఎకరాల చొప్పున దేశ్‌ముఖుగారి పొలం కౌలుకు తీసుకుని సేద్యంచేస్తూ ఉంటారు. రైతులకు ఇవ్వగా మిగిలిన దేశ్‌ముఖ్ పొలం వేల ఎకరాలు ఉంటుంది. ఆయా గ్రామాల్లోని ప్రజలు ముందు దేశ్‌ముఖ్‌గారి పొలంలో పనులు పూర్తయినాకే తమ సొంత పొలాల్లో పనులు ప్రారంభించాలి. ఒక్కమాటలో చెప్పాలంటే... దేశంలో ఇతర చోట్ల రైతులు పంటలు పండించినందుకు శిస్తులు కట్టాలి. కానీ తెలంగాణాలో శిస్తులు చెల్లించడానికే పంటలు పండించాలి.

పనికి పిలిస్తే రాములమ్మ రాలేదని పటేల్ ఏజెంటు అప్పన్న, రాములమ్మ కూతురు రాజాలును జుట్టుపట్టి ఈడ్చుకెల్తాడు. అక్కడ ఆమె రౌడీల దుర్మార్గానికి బలౌతుంది. నిస్సహాయంగా ఇంటికి చేరుతుంది. కూతురుకు జరిగిన అన్యాయాన్ని చూచి మల్లారెడ్డి, రాములమ్మలు వేదన చెందుతూ ఉంటారు. ఇంతలో అప్పన్న వచ్చి, తమతో గొడవపెట్టుకుని చేయి కరచిందని, గిచ్చిందని దీనికిగాను జుల్మానా క్రింద ఇంట్లోని ఇత్తడి బిందెను తీసుకుని వెళ్ళిపోతాడు. ఈ విషయం తెలుసుకున్న మల్లారెడ్డి పెద్ద కొడుకు. పటేల్ ఇంటికి పోయి ఇత్తడి బిందెను తానే దొంగతనం చేస్తున్నాననే ఆత్మన్యూనతాభావానికి లోనౌతాడు. రౌడీలు అలికిడి విని లేవడంతో వారికి కన్పించ కుండా ఆ అర్ధరాత్రి ఊరు విడిచి హైదరా బాదుకు పారిపోతాడు. అక్కడ నానా అగచాట్లు పడతాడు. చివరకు తనకు రైల్లో పరిచయమైన తాత అనే ఓ వ్యక్తి దగ్గరకు చేరి ఫ్యాక్టరీలో కార్మికునిగా చేరుతాడు.

కొంత కాలానికి... పటేల్ మాట కాదన్నందుకు మల్లారెడ్డిని కొట్టి చంపుతారు.

భర్తపోయిన తర్వాత కుటుంబ బాధ్యతంతా రాములమ్మ మీద పడుతుంది. రాములమ్మ పెద్ద కొడుకు అచూకీ తెలియకపోవడంతో..వేరే గ్రామంలో తాతగారి ఇంట్లో పెరుగుతున్న నాలుగేళ్ళ కొడుకుని నర్సిరెడ్డి తీసుకొచ్చి పెంచుతూ ఉంటుంది. రాములమ్మ చిన్న కొడుకు ఎల్లారెడ్డి. క్రమేపీ 'సంగం' సభ్యులతో పరిచయాలేర్పచుకొని పార్టీ కార్యకర్తగా మారతాడు. తొలిసారిగా ఆ గ్రామంలో దేశ్‌ముఖు ఎదుట నిలబడి ఎదిరిస్తాడు. తన కార్యక్రమంలో సుబాన్ కొండంత అండగా నిలుస్తాడు. ఆ తర్వాత మహబూబ్ కలుస్తాడు. రైతులు చేసే తిరుగుబాటు ముస్లింలపైన హిందువులు చేసే తిరుగు బాటుగా పటేల్ పాపన్న, రౌడీ అప్పన్నలు ప్రచారం చేస్తారు. కొందరు ముస్లింలు తమ నవాబుపైన జరిగే తిరుగుబాటుగా భావించినా, క్రమేపీ ఏ మతం వారైనా పేద రైతులంతా ఒక్కటే అని భావించి అందరూ ఏకంగానే సంగం తరఫున సంఘటిత మవుతారు.

ఈలోపు దేశ్‌ముఖ్ ఆ గ్రామానికి వస్తాడు. తమ దొడ్లో పనిచేసే మహబూబ్ అన్న కూతురు ఫాతిమాపై కన్ను పడుతుంది. ఈ విషయం తెలుసుకున్న గ్రామ సంగం సభ్యులు ఆమెను ఊరి నుండి తప్పిస్తారు. ఆమెపై దొంగతనం నేరం మోపి పోలీసు సార్జంటు, పటేల్ పాపిరెడ్డి గ్రామంలోకి వచ్చి సోదాలు చేస్తారు. దాన్ని ఎల్లారెడ్డి ఎదిరిస్తాడు. గొడవ జరుగుతుంది. తన దగ్గరున్న కర్రతో పాపిరెడ్డి తల పగులకొడ్తాడు సుబాన్...

కానీ ఈ గొడవకు కారణమైన ఎల్లారెడ్డిని అరెస్టు చేస్తారు. పొరుగు గ్రామాల నుండి

రౌడీలను, పోలీసుల్ని తెప్పించి ఆ గ్రామంలో అరాచకం సృష్టిస్తారు. ఆటలాడుతూ ఎర్ర జెండా పట్టుకున్నందుకు రాములమ్మ నాలుగేళ్ళ మనవణ్ణి కూడా అతిదారుణంగా చంపేస్తారు. ఈలోగా ఎల్లారెడ్డి పోలీసుల నుండి తప్పించుకుని పారిపోతాడు.

పార్టీ నాయకత్వంలో గ్రామమంతా చైతన్యం చెందుతుంది. పాపిరెడ్డి చనిపోతాడు. దేశ్‌ముఖ్‌లు, రౌడీలు పారిపోతారు.

తన తమ్ముడు అరెస్టయినట్టు వార్తా పత్రికలో చదివి పట్టణం నుండి నర్సిరెడ్డి తిరిగి గ్రామానికి వస్తాడు. ఇంతలో ..గ్రామం వదిలి పారిపోతున్న దేశముఖ్ మూకల్ని ఎదిరించి వారి కాల్పులకు గురౌతాడు. పారిపోయిన దేశముఖ్ మిలిటరీ సైన్యంతో తిరిగి తమపై దాడికి వస్తున్నాడని తెలుసుకుని రైతులంతా తమకు దొరికిన ఆయుధాలతో తిరుగుదాడికి సిద్ధంగా ఉంటారు. రాళ్ళు, వడిసెలు, కారపునీళ్ళు, కర్రలు, కత్తులు..ఇవే వారి ఆయుధాలు. వీరందరి ముందు రాములమ్మ ఉంటుంది...

ఇదీ ఈ నవల కథాంశం.

తెలంగాణా రైతాంగం పడ్డ ఇబ్బందుల్ని ఎంతో హృదయ విదారకంగా చిత్రించాడు రచయిత.

మొత్తం నవలలో చాలా కొద్ది సన్నివేశాలు, పాత్రలు మాటాడిన తీరు కొంత "సినీ ట్రిక్కు"గా ఉన్నప్పటికీ, రచయితపై గోర్కీ 'అమ్మ' నవల ప్రభావం ప్రస్ఫుటంగా కన్పిస్తూనే ఉంటుంది.

మొదట కొడుకు చేసే పనులు అర్థంకాక, "మనకెందుకులే పనులు" అనుకునే రాములమ్మ క్రమేపీ ..చివరికి తానే పోరాటంలో ముందు నిలబడుతుంది. ..తల్లి, కొడుకుల మధ్య సంభాషణలు, కార్యకర్తలకూ, రాములమ్మకూ మధ్య జరిగిన సంఘటనలు.. చాలా వరకు "అమ్మ" నవలనే గుర్తుకు తెస్తుంటాయి.

మరీ ముఖ్యం. ఏ కులం వారైనా, ఏ మతం వారైనా పేదలంతా ఒక్కటే, వారి బాధలన్నీ ఒక్కటే-కులాలకు, మతాలకు అతీతంగా పేదలంతా కలసి తిరగబడాలి అనే సందేశాన్ని చాలా శక్తివంతంగా ఈ నవల అందించింది. ఈ నవల ప్రధాన ఉద్దేశ్యం కూడా ఇదే.

ఈ నవలకి "మృత్యుంజయులు" అనే పేరు పెట్టడం కూడా ఎంతో బాగుంది. మృత్యుంజయులు అంటే మృత్యువును జయించినవారు.

"చచ్చేవాడికి రెండు చావుల్లేవు- దిన దినం చావడం కంటే భావితరాలు బ్రతకడం కోసం పోరాటంలో చావడం మేలు అని భావించి పోరాట జెండాపట్టి నేలకొరిగిన వీరులే మృత్యుంజయులు.

పటేల్‌ను ఎదిరించినందుకు మల్లారెడ్డి మరణించాడు.

దేశముఖ్ రౌడీల్ని ఎదిరించి ఎల్లారెడ్డి చనిపోయాడు.

ఎర్ర జెండా పట్టుకొని...నాలుగేళ్ళ ఎల్లారెడ్డి కొడుకూ నేలకొరిగాడు.

పట్టణంలో సమ్మె సందర్భంగా తాత కూడా వీరమరణం పొందాడు.

వీరంతా చావుని జయించినవారే.

తమ చావుని కూడా పది మంది ఉపయోగంకోసం వినియోగించినవారే.

చనిపోయీ....చిరకాలం గుర్తుండే అమరులే...

వీరంతా మృత్యుంజయులే.....

తెలంగాణా పోరాట కాలంలో వచ్చిన తొలి నవలగానూ, ఒక చారిత్రక అవసరాన్ని గుర్తించిన నవలగానూ తెలుగు సాహిత్యంలో దీనిస్థానం సుస్థిరం.

ఫలితంగా నవలా కర్త బొల్లిముంత శివరామకృష్ణ కూడా మృత్యుంజయులుగానే.. వుంటారు.



# గల్పిక : డబ్బుగారి రాజ్యం

'హహహహ...ఉహుహుహుహు...' అని చలికి వణికిపోతూ వళ్లు కటకటలాడిస్తూ..."అమ్మా...దుప్పటి కప్పవే"... అన్నాడు పిల్లవాడు.

"లేదు బాబు- మనకి దుప్పటి లేదు" అంది తల్లి.

"పోనీ...నీ చీర చెంగైనా కప్పమ్మా" అన్నాడు పసివాడు.

"చీర చిరిగి జీరండాలయ్యింది బాబూ..." అంది తల్లి.

"చీరెలు, దుప్పట్లూ నేసేది నాన్నేగా?" అన్నాడు ఆ బాబు, తల్లి ఔనన్నట్లుగా తలవూపి వూరుకుంది.

"మరి మనకి దుప్పట్లు, చీరెలూ ఎందుకు లేవు" అడిగాడు కొడుకు. అమ్మ ఒడిలో దూరుతూ-

"మనం కూలీ డబ్బులకి దుప్పట్లూ, చీరెలూ నేస్తాం. అంతే, ఆ దుప్పట్లు, చీరెలూ, యజమాన్లు అమ్ముకోవటానికి"

"అయితేనేం...మనం కొనుక్కో వచ్చుగా?"

"కొనటానికి మనకి డబ్బులు లేవు"

"ఏం ఎందుకులేవు?"

"నాన్నకిప్పుడు పనిలేదు...కూలీ డబ్బులు రావు".

"పనెందుకు లేదూ..."

"దుప్పట్లూ, చీరెలూ అమ్ముడు కాక, గుట్టలు, గుట్టలు పడి వున్నాయట. యింకా నేయించి యేం చేసను కుంటారూ? అందుకని పనిమాని పించేశారు".

"యెందుకు అమ్ముడు కావటం లేదూ... జనానికి చలి వుందిగా..."

"జనానికి చలి వుంది...కాని దుప్పట్లు కొనేంత డబ్బుల్లేవు..."

"అక్కడ దుప్పట్లు గుట్టలు గుట్టలుంటే, మనలాంటి వాళ్లకి కప్పుకోవటానికి ఒక్కటి కూడా లేకపోవటమెందుకు" అన్నాడు పిల్లవాడు. తల్లి చెప్పలేకపోయింది. కుర్రవాడు ఆలోచనలో పడ్డాడు...

"జనానికి కొంటానికి డబ్బులు లేవు. దుప్పట్లు అమ్ముడుపోవు...దుప్పట్లు అమ్ముడు పోకపోతే, మగ్గాలు మూసేస్తారు. నాన్నకి పనుల్లేవు. పనిలేకపోతే డబ్బులు లేవు.... డబ్బులు లేకపోతే... దుప్పట్లు అమ్మరు...." అంతే బాబు... మనం నేసే దుప్పట్లు మనం కప్పుకోవటానికి కాదు.... యజమానికి లాభాల కోసం. డబ్బులు పోగు బెట్టటానికి...అంతే బాబూ...."

"ఆ డబ్బులన్నీ యేమౌతయ్..."

"అందరం చేసే చాకిరి ఫలితాలు యజమాని జేబుల్లోకి పోతయ్...."

కుర్రవాడు హు హు హు హు అని వణుకుతూనే తల్లి ఒడిలోనించి లేచాడు.

"చలి చలి చలి చలి చందానవ్వి, కుంపటి తేవే గుడ్డవ్వా..." అని పాడుకుంటూ పక్క గుడిసెలో దూరాడు.

"కుంపటి యేం చేసుకుంటావ్ రా మనమడా...బొగ్గులు లేకుండానూ"... అంది ముసలమ్మ.

"బొగ్గులెందుకు లేవు..బాబాయి బొగ్గు తవ్వుతుంటాడుగా..." అన్నాడు మనుమడు.

బాబాయి తవ్విన బొగ్గు ఏడాదికి సరిపడా గుట్టలుగా పడివుందట... అందుకని మీ బాబాయిని మెచ్చి "యిక చాలు యింటికి పోవయ్యా..." అని పనిలోంచి పంపించేశారు.

"అక్కడ బొగ్గులు గుట్టలు పడి వుంటే, యిక్కడ మనకి చలికాచుకోవటానికి కూడా బొగ్గులు లేకపోవటమేం!" అడిగాడు మనుమడు.

"మనం బొగ్గు తవ్వేది, మనం సలికాసుకోవటానిక్కాదురా మనుమడా... యజమాన్లు డబ్బులు బోషాణాల్లో యేసుకుని కూసోటానికి" అంది ముసలమ్మ.

పిచ్చి కుదిరితేగాని, పెళ్లి జరగదు.

పెళ్ళి జరిగితేగాని పిచ్చి కుదరదు.

"బొగ్గు, దుప్పట్లూ అమ్ముడుబోతేగాని పని దొరకదు, డబ్బు రాదు, డబ్బుంటేగాని దుప్పట్లు బొగ్గు దొరకవు.

*

- బొల్లిముంత శివరామకృష్ణ

**వ్యాసం:**

# బొల్లిముంత శివరామకృష్ణ అముద్రిత రచనలు- ఒక పరామర్శ

- కొత్తపల్లి రవిబాబు

**బొల్లిముంత** శివరామకృష్ణ ఒక సాహితీ కర్మాగారం. ఈ ఏడాది జూన్ 7న మరణించేంత వరకు ఆయన మేధస్సు చురుకుగా పనిచేస్తూనే వుంది. వారు రాసుకున్న నోట్సులో, కథలకు, సినిమాలకు, నాటికలకు, వ్యంగ్య రచనలకు పనికివచ్చే అంశాలు పరిశీలిస్తే, ఆయన నిరంతరం సృజనాత్మక కృషిలో నిమగ్నుడైనాడని అర్థం చేనుకోవచ్చు. వారి రచనలెన్నో అసంపూర్ణంగా వున్నాయి. మరెన్నో అముద్రితాలుగా వున్నాయి. వీటిలో కొన్ని అముద్రితాలేగాని, కొన్ని నాటికలు, నాటకాలు ప్రదర్శించడం మాత్రం జరిగింది. వ్రాతప్రతులుగా మాత్రమే నేడు అవి లభ్యం.

శివరామకృష్ణ కథల్లో వ్యంగ్యం కొట్టొచ్చినట్లు కనబడుతుంది-అదే లక్షణం ఆయన రాసిన నాటికల్లో, నాటకాల్లో చూడగలం. ప్రస్తుతం మనకు లభ్యమైన కొన్ని అముద్రిత రచనలను పరిశీలిద్దాం.

కృష్ణాజిల్లా ప్రజానాట్యమండలి 1980లో హనుమంతరాయ గ్రంథాలయంలో ప్రదర్శించిన రూపకం **నేటి భారతం**. దీనిని శివరాం 1974 ప్రాంతంలో రాశారు. ఆనాటి ప్రదర్శనకు సంగీతం ఆచార్యశ్రీ సమకూర్చారు. నృత్యం పి.పి.ఆనంద్, వై.పరంధామయ్యలు కూర్చగా, కొడాలి ఆదిశేషయ్య ప్రయోక్తగా వున్నారు. శిర్విసెట్టి సుబ్బారావు, కోసూరు పున్నయ్య, పురుషోత్తం పాత్రుడు, హృదయరాజ్ మొదలగువారు నటించారు.

1974 ప్రాంతంలో దేశంలో నెలకొని వున్న నిరుద్యోగ సమస్య, అధిక ధరలు, దోపిడీ, అణచివేత, లంచగొండితనం, బ్లాక్‌మార్కెట్ మొదలగు సమస్యలన్నీ మరింత జటిలమై, సామ్రాజ్యవాదం తెచ్చిపెట్టిన సరికొత్త సమస్యలతో నిండిన నేడు ఈ రూపకంలో సమకాలీనత చూస్తాం. కార్మికుడు, రైతు, ఉద్యోగి, వ్యవసాయకూలీ, జాతీయ యువకుడు అందరూ కలిసి ఉద్యమించగా, పెట్టుబడిదారుడు ఒక్కొక్కరితో విడివిడిగా మాట్లాడి వారి సంఘటిత శక్తిని విడగొట్టి తన పబ్బం గడుపుకుంటాడు. ప్రజలను వదలి, తుపాకి పట్టి అడవులకు పోయిన యువకుడి పాత్ర ద్వారా నక్సలైట్లలో చారుమజుందార్ వర్గాన్ని విమర్శిస్తాడు. యువతరాన్ని ప్రక్కదారి పట్టించడానికి సర్వోదయ ఉద్యమకారులు చేసిన ప్రయత్నాన్ని ఎండకట్టారు. మరో యువకుడి నాయకత్వాన, సమైక్య పోరాట శక్తి విజృంభిస్తుంది. ఆధ్యాత్మిక గురువు ఆనంద మూర్తి, పెట్టుబడిదారుడు మొదలగువారు పారిపోతారు. చివర్లో యువకుని పాత్ర ద్వారా 'నూతన వామపక్ష ప్రజాతంత్ర ఐక్య సంఘటనే' నేటి భారతానికి రాచబాట అని చెప్పటంతో రూపకం ముగుస్తుంది.

ఈ రూపకంలో శివరాం తాను రాసిన పాటలేగాక, రాయప్రోలు సుబ్బారావు, **'శ్రీలు పొంగిన జీవగడ్డ'**, తెన్నేటి సూరి **'స్వర్గానికి రోడ్డు'**, శ్రీశ్రీ గేయాలు సందర్భోచితంగా ఉపయోగించుకున్నారు.

శివరాం దీనిలో రాసిన సంభాషణల్లో కొన్ని మచ్చుతునకలు. తెల్లవాడి గురించి చెబుతూ, "వాడు మంచి బంగళాలు కట్టించుకున్నాడు. మనకు జైళ్ళు కట్టించాడు" ; కార్మికుడి పాత్ర ద్వారా చీలిపోయిన కమ్యూనిస్టు పార్టీలపై విమర్శ ఇలా చేస్తారు. "సంఘంగా వుంటే బలమంటారు. ప్రపంచ శ్రామికులారా! ఏకం కండి అంటారు. వాళ్ళే మనిషికో సంఘం పెడతారు", కాంగ్రెస్ పార్టీ వారి గురించి చెబుతూ, 'చిన్నప్పుడెప్పుడో గాంధీగారి చెప్పు దొంగిలించాడట ఈ దేశ భక్తుడు. ఆ కారణంగా దేశమూ, ప్రభుత్వమూ, తనదిగా చేసుకున్నాడు'; 'ప్రజలను దోచుకోవటం, దాచుకోవటమే పనిగా పెట్టుకున్నాడు'.

పోస్టర్ అనే నాటిక మూలం ఎవరిదో తెలియదు. కాని సంభాషణలు బొల్లిముంత రాశారు. ఒక ఫారెస్టు కంట్రాక్టరు క్రింద కట్టుబానిసలు పని చేస్తుంటారు. పట్నానికి పోయిన ఎల్లాయ్ అందంగా వుంది కదా అని దొరికిన ఒక పోస్టర్‌ను తెచ్చి గోడకి అతికిస్తాడు. అది కార్మిక సంఘానికి చెందిన పోస్టర్. దానిలో ఏం రాసివుందో ఈ వెట్టి చాకిరి చేసే వారికి తెలియదు. దానిని చూసిన కంట్రాక్టరు కూలీరేటు పెంచేస్తాడు. ఆ తర్వాత వీరడిగిన డిమాండ్‌ను తేలిగ్గా అంగీకరిస్తాడు. అప్పుడు ఆ పోస్టర్‌లో ఏముందు కనుక్కొని, దాని ఆధారంగా కూలిసంఘం పెట్టుకొని యజమానులు చేసే రకరకాల దౌష్ట్యాలను ఎదిరిస్తారు.

'శ్రమశక్తులు, జనశక్తులు
కదనానికి కదిలొస్తే
లాఠీలు, బెదిరింపులు
చెరసాలలు, ఉరికొయ్యలు
అడ్డలేవు-అణచలేవు అంటూ నాటిక ముగుస్తుంది. కాగితం ముక్క (పోస్టర్) చూసి జడుసుకున్న యజమానికి, వ్యతిరేకంగా

## ఉత్తరం

**గురుతుల్యులు**
**బొల్లిముంత శివరామకృష్ణగారికి-**

నమస్సులు- ఇవ్వడే 'నాజ్'లో (గుంటూరు) 'మనుషులు మారాలి' చూచి వచ్చి ఈ ఉత్తరం రాస్తున్నాను.

ఇరవై ఏళ్ళ క్రిందట ప్రసాద్ గారి పిక్చర్ 'ద్రోహి' చూచాను. ఇవ్వాళ 'మనుషులు మారాలి' చూచాను. మధ్య ఎన్నో సినిమాలు చూచినందుకు నిట్టూరుస్తున్నాను-

ఇంత మంచి సినిమా తెలుగువాళ్ళకి చూపుతున్నందుకు ఆ చిత్రం తాలూకు ప్రతి కళాకారుడు, ప్రతి టెక్నీషియను ధన్యుడు. అది కథ కాదు జీవితం. పేదవాళ్ళ బ్రతుకులు ప్రతిబింబిస్తున్న నిలువెత్తు నిలువుటద్దం. సమాజ జీవితాన్ని చూపుతున్న దివిటీ. చిత్రంలోని ప్రతి ఫ్రేము లోనూ పనితనం కనిపించింది.

శ్రీ మధుసూదనరావుగారి దర్శకత్వం ఈ చిత్రంలో ఎవరెస్టు. వారు ఏజ్‌కి ఒకతరం ముందు పుట్టిన ప్రొగ్రెసర్. మీ మాటలు-మీకు సినీ రచయితల్లో చెరగని చెదరని సముచిత స్థానాన్ని సముపార్జించి పెట్టాయి. జాతీయాలతో, పలుకుబళ్ళతో ప్రేక్షకులకు గిలిగింతలు పెట్టాయి. మీ కలం పదునైనది. బలమైనది. థౌజండ్స్ ఆఫ్ కంగ్రాచ్యులేషన్స్ ఫర్ యువర్ పవర్‌ఫుల్ పెన్!

నటీనటులు చక్కగా నటించారు. శారద అంతపాటి నటి అనుకోలేదు నేను. ఒక్క కాంచన మాత్రం కోర్టు సీనులో మిజరబుల్ ఫెయిల్యూర్!

మీ కలం నించి, మధుసూదనరావు గారి దర్శకత్వంనించి -ఈ 'లక్ష్మీపతుల' సమాజానికి-యిలాటి చిత్రాలు ఎన్నివస్తే అంత మంచిది.

మరోసారి అభివందనలు. మీకూ మీ దర్శకుడు-ఆంధ్రుల అభిమాన దర్శకుడు మధుసూదనరావుగారికిన్నీ-

**గుంటూరు,** **నమస్సుమనస్సులతో**
**7.10.'69.** **నాగభైరవ కోటేశ్వరరావు**

పీడితులు ఉద్యమిస్తారు. తమ న్యాయమైన హక్కుల కొరకు పోరాడతారు.

ధర్మసంస్థాపనార్థాయ అనే రచన ఫాంటసీ కలిసిన సాంఘిక నాటిక. 1966 అగస్టు ప్రాంతంలో ఉక్కు ఉద్యమం ప్రారంభమైన కాలంలో రాసిన రచన. నారదుడు ఆంధ్రదేశంలో ప్రజల దీనస్థితినీ, రాజకీయుల పదవుల కుమ్ములాటలు, అవినీతి, అరాచకం గురించి మహావిష్ణువుకు చెప్పగా, ప్రత్యక్షంగా పరిస్థితి చూడటానికి ఇద్దరూ ఆంధ్రకు వస్తారు. పాపా(ల)రాయుడు పాత్ర కుళ్ళు రాజకీయ నాయకుడికి ప్రతీకగా వుంటుంది. ఈ పాపారాయుడు పుత్రుడు శ్రీమన్నారాయణ. కళాశాల విద్యార్థి. అతనిలో మహావిష్ణువు ప్రవేశిస్తాడు. నారదుడు ఒక పత్రిక సంపాదకుడిగా మారతాడు. కొడుకు శ్రీమన్నారాయణ అన్యాయాలకు ఎదురుతిరుగుతాడు. తండ్రి కొడుకును 'బుద్ధిమంతుడిలా చదువుతావా? బటాచోర్లా తిరుగుతావా?' అంటే కొడుకు, 'బుద్ధిమంతుడిలా తిరుగుతాను. బటాచోర్లా చదవను' అంటాడు. అంతిమంగా తను చేసే అక్రమాలకు అడ్డు వస్తున్నాడని చెప్పి ఉక్కు ఉద్యమంలో పాల్గొంటున్నాడన్న సాకుతో కొడుకును అరెస్టు చేయమని పోలీసులకు చెప్తాడు. ఈ కొడుకులో ప్రవేశించిన విష్ణువు అది విని జైలు జీవితానికి భయపడి బయటికి వచ్చేస్తాడు. చివర్లో నారదుడంటాడు–"ఈ పాపాత్ముణ్ని, వీరి ప్రభుత్వాన్ని ఓడించడానికి, దించడానికి దేవుడి వల్ల కాలేదు. ఈ ప్రజాయుగంలో ప్రజలే దేవుళ్ళు. ఈ కలియుగంలో సంఘానిదే శక్తి. ఓ శ్రామిక జనులారా ప్రజాశక్తితో ఈ ప్రభుత్వాన్ని దించండి". నాటిక పూర్తవుతుంది.

పద్యనాటికాలు అలవోకగా రాయగల్గిన శివరామకృష్ణ ఈ నాటికలో మూడు పద్యాలు సందర్భోచితంగా రాశారు.

## మరో ఉత్తరం

గౌరవనీయులైన
శ్రీ శివరామకృష్ణగారికి,
నమస్కారం!

కేవలం పొగడాలనిగానీ, లేక యేదో పిచ్చిలోగానీ యీ లెటర్ వ్రాయడంలేదు. చాలా కాలం తర్వాత పొందిన తృప్తిని వెల్లడించుకుంటున్నాను. అంతే!

"మనుషులు మారాలి!" చూశాక గట్టిగా ఓసారి వూపిరి పీల్చి వదిలాను. చాలా కాలంగా యెదురు చూస్తున్న "విషయం" యిది. చాలా తృప్తి కలిగించింది.

కథలో పటుత్వం యెంతగా వున్నా సంభాషణలు సరిగా లేకపోతే అది పాపులర్ గావటం చాలా కష్టం. మీరు సరిక్రొత్తగా గోదాలోకి దిగి ఈ చిత్రానికి మాటలు వ్రాస్తున్నారని విని మొదట కొంత అపోహపడ్డాను. తీరా సినిమా చూశాక 'నేను చాలా పొరబడ్డానని' బాధపడ్డాను.

కంగ్రాచ్యులేషన్స్.

ఒక ముఖ్య విషయం. ఇంత ఉత్తమ చిత్రానికి మొదటిసారిగా సంభాషణలు వ్రాసే అదృష్టం మీకు కలిగింది. పైపెచ్చు ఆ కృషిలో భాగస్వాములు కావటం కూడ లెక్కించాల్సిన విషయమే!

మీకు మరోసారి అభినందనలు.

భవదీయ
గుత్తికొండ సుబ్బారావు
7.10.'69.

పిఎస్: మొదటిసారి చూసినప్పుడు హాలులో గోలగా వుండి సంభాషణలు సరిగా విన్పించలేదు. తీరిగ్గా రాత్రి మళ్ళీ చూశాను.

ఎన్టీ రామారావు రాజకీయరంగ ప్రవేశం కథా వస్తువుగా, వ్యంగ్యాత్మకంగా 1982 ప్రాంతంలో రాసిన నాటిక దొందూ దొందే. మొదటి దృశ్యంలో మ్యూజికల్ చైర్స్ (ఎన్నికలు)లో స్వరాజ్యం కుర్చీ అమ్మ కొడుకుల (కాంగ్రెసు) పాలౌతుంది. డ్రామారావును కొందరు రాజకీయాల్లోకి రమ్మనమని బలవంతం చేస్తారు. డ్రామారావు రాజకీయాల్లో ప్రవేశించి సినిమా తరహా డైలాగులు కురిపిస్తుంటాడు. రైతన్నల, కార్మికుల, నిరుద్యోగుల, ఆడబడుచుల సమస్యలను తీర్చడానికి 'దైవాంశ నుంచి ఉత్తేజితుడై, దైవ ప్రేరితుడై, దైవ ఆజ్ఞ పొంది' వచ్చానని చెప్తాడు డ్రామారావు. రైతన్నతో దేవుడిచ్చిన భూమికీ, నీటికీ పన్నా అంటూ ఓట్లు వేయించుకొని గెలుస్తాడు. చివరి దృశ్యంలో 'పాతది అమ్మా కొడుకుల పార్టీ అయితే, మనది నా, నీ పార్టీ. అంటే మామా అల్లుళ్ళ పార్టీ' అని ప్రకటిస్తాడు. కాంగ్రెస్ ఐనా, తెలుగుదేశం ఐనా ఒకే తానులో ముక్కలనీ, ఇవి దొందూ దొందేనని ఈ నాటిక చెబ్తుంది.

రైతుబిడ్డ నాటిక పేద రైతుల దుస్థితి కథాంశంగా సాగింది. చేసిన బాకీల కింద, వడ్డీ కింద భూమిని బాకీదారుడు జమ కట్టుకుంటాడు. పంట (పొగాకు) అమ్మే సమయంలో ధర నాసిగా వుండి రైతు ఆర్థిక పరిస్థితిని దిగజార్చుతుంది. వేలం పాడినవాడు ఎడ్ల పట్టెడ కూడ లాక్కోగా, 'పూలమ్మినచోట కట్టెలమ్మలేం. ఏ బస్తీకో పోయి కూలో, నాలో చేసుకుని బ్రతుకుదాం' అంటూ రైతుకుటుంబం గ్రామం వదలి పోతుంది.

ఇది మరీ చిన్ననాటిక (11 పుటలు ఫుల్‌స్కేప్) కావడంతో రచయిత రైతాంగానికి, వ్యవసాయ కూలీలకు సంబంధించి సూక్ష్మ పరిశీలనలోకి వెళ్ళలేదు. అదీగాక సామ్రాజ్యవాద ప్రపంచీకరణ ఉధృతం కాని సమయంలో రాసిన నాటిక కనుక, ప్రస్తుతం ఇది అంతగా ఆకట్టుకోదు.

4 పుటల నాటిక బడిపంతులు. అయితే దీనిలో బడిపంతులు స్కూలు జీవితం, విద్యా విషయక అంశాలు ఏమీలేవు. ఆడపిల్లల వివాహాలు కట్నం ఇచ్చి చేయడం, మగపిల్లల వివాహాలకు కట్నం తీసుకోవడం కథాంశంగా సాగుతుందీ నాటిక. రేడియోలో ప్రసారం కోసం రాసినట్లు కనబడుతుంది.

అన్యాయలోకంలో న్యాయం కథ నాటిక హైస్కూలు విద్యార్థుల ప్రదర్శనకోసం రాసినట్టుంది. అన్యాయ మహరాజు కొలువు దీరి వుంటాడు. ప్రజలు తమ సమస్యలు చెబితే వాటికి తలతిక్క పరిష్కార మార్గాలు చెబుతాడు. ఒక కేసులో కంసాలిబత్తులకు ఉరిశిక్ష విధిస్తాడు. వారు బాబా, బావ మరుదులు. నన్ను ముందు ఉరి తీయండి-నన్ను తీయండి అని పోటీ పడతారు. ఎందుకంత ఉత్సాహం చూపుతున్నారని అడిగితే వాళ్ళు ముందుగా ఉరితీయబడ్డవాడు వచ్చే జన్మలో ఈ రాజ్యానికి రాజు అవుతాడనీ, తర్వాతివాడు మంత్రి అవుతాడనీ చెప్తారు. అప్పుడు ఈ తలతిక్క రాజు, మంత్రి వచ్చే జన్మలో కూడా తామే అధికారం చలాయించాలని తామే ఉరి వేసుకుంటారు.

1983లో రాసిన శాంతి-క్రాంతి శివరామకృష్ణ అముద్రిత రచనల్లో ముఖ్యమైనది. 22 పుటల ఈ నాటికలో శాంతి దూత, బానిస, అర్థ బానిస, ఉద్ఘోషకుడు, మానవుడు, పుడమితల్లి, చరిత్ర, పుడమి, అస్థిపంజరం, వియత్నాం పిల్లల గొంతు, మిలటరీకంఠం, యుద్ధోన్మాది, సైంటిస్టు, రీగన్, కబంధుడు, డాలర్, మార్గరెట్ థాచర్ మొదలగు పాత్రులున్నాయి. దీనిలో స్పష్టంగా అమెరికన్ సామ్రాజ్యవాదపు యుద్ధోన్మాదం, డాలర్ ఆర్థికం, వియత్నాంపై దాడి మొదలైన

ఎన్నో విషయాలు ప్రస్తావింపబడి, ఎంతో రాజకీయ చైతన్యంతో నిండివుండటం చూడగలం.

**దొంగ దొరికింది** నాటిక ఆకాశవాణి మదరాసు కేంద్రం ప్రసారం చేసింది. ఒకరి ఇంట్లో పోయిన పది రూపాయల నోటు ఎవరు తీసారో కనుక్కోడానికి ఒక యుక్తిపన్ని, అసలు దొంగను పట్టుకోవడమే కథాంశం.

**అవిఘ్నమస్తు** అనే వ్యంగ్య ప్రధాన రచనలో ఒక రాజకీయ నాయకుడు ప్రజా ఉద్యమం పేరుతో వినాయకుడైపోవడం, ప్రజలు అతన్ని ఆత్మవిమర్శ చేసుకోమంటే, అది హత్యతో సమానమని చెప్పి దేవుడిగా స్థిరపడటం అనేది వస్తువు. కొందరు రాజకీయ నాయకులు దేవుళ్ళు కావడమన్న విషయాన్ని సునిశితంగా విమర్శిస్తూ రాసిన 6 పుటల రచన ఇది.

శివరామకృష్ణ గల్పికా రచనలో సిద్ధహస్తులు. 'నిప్పు–నీరు–పెళ్ళి' అనే రచనలో బాయిలర్‌లో నిప్పు–నీరుకి కలయిక గురించి చెప్తారు. ఫలితంగా జన్మించిన ఆవిరి ప్రజలకు ఎలా ఉపయోగపడుతుందో చెప్పారు. మరో గల్పిక ఎవరు పెద్ద లో చందమామ, ఆకాశం, నీళ్ళగుంట, ఒంటికంటి కాకి, కాకి కనురెప్ప తమలో ఎవరికివారే పెద్ద అనుకోవడం, కనురెప్ప ఆఖరికి తానే పెద్దనీ, తాను తెరిస్తేనే ఈ విశ్వమంతా కనబడుతుందనీ చెప్పడంతో ముగుస్తుంది.

**అల్లాఉద్దీన్–అక్షరదీపం** అనే నాటికలో నిరక్షరాస్యతవల్ల వడ్డీ వ్యాపారులు పేదవారిని ఎలా పీల్చి పిప్పి చేస్తున్నారో తెలియచేశారు. అక్షరజ్యోతి, అక్షరక్రాంతి మొదలగు పథకాలలో సంతకం చేయడం నేర్పి అక్షరాస్యత వచ్చిందన్న బూటకపు ప్రచారం జరుగుతోంది. తాను సంతకం చేసే కాగితంలో ఏమి రాసి వుందో చదివే శక్తి వస్తేనే అక్షరాస్యత వచ్చినట్లుగా పరిగణించాలి. సమాజంలో వివిధ శ్రామికులు నిరక్షరాస్యత వల్ల ఎలా మోసపోతున్నారో ఈ నాటికలో వివరించారు.

భార్య (జ్యోతి)ని తండ్రి ఇంటివద్ద నుంచి ఇరవై వేలు తెమ్మనమనీ, ఆ డబ్బుతో స్కీము పెట్టి లక్షలు లాభాలు గడించాలనీ, లేదా సినిమా తీసి లాభాలు గడించాలనీ ప్రణాళికలు వేసే అత్తా, భర్తా–(గజలక్ష్మి, ప్రసాద్), కోడలును సమర్థించే, మామ (గజపతి), స్కీముల సృష్టికర్త వైకుంఠం పాత్రలుగా వున్న మరో నాటిక మూడవ దృశ్యం నుంచీ వున్న అముద్రిత నాటిక (పేరులేదు)లో కోడళ్ళపై జరుగుతున్న అత్యాచారాలను శివరామకృష్ణ వివరించారు. అంతిమంగా ఆ కోడలును డబ్బుతెస్తేనే తిరిగి రమ్మనమని చెప్పి ఇంట్లో నుంచి తరిమేస్తారు.

**రాజకీయ గయోపాఖ్యానం, రాజకీయ కురుక్షేత్రం ఫక్కీలో రాముడి రాజ్యం, భరతుడి పట్టం** అనే చెప్పులు ఎక్కే సింహాసన భాగోతం అనే అసంపూర్ణ రచనలో యక్షగాన ఫణితులతో రాసిన రచనలో భరతుడు తన దేశం ఎట్లా వుందో తెలుసుకోడానికి వస్తాడు. ఈ రచన ఇక్కడి వరకే లభ్యం. అసంపూర్ణం.

కమ్యూనిస్టు పార్టీ వజ్రోత్సవం సందర్భంగా పాటలతో కూడిన ఒక రూపకాన్ని శివరామకృష్ణ తయారు చేశారు. దీనిలో తెలుగువారి గత వైభవం, తెల్లవారి పాలన, జాతీయోద్యమం, కాంగ్రెసు పాలన, కమ్యూనిస్టు పార్టీ ఉజ్వల చరిత్ర–వ్యాఖ్యానం రూపంలోనూ, పాటలతోనూ రూపొందించారు.

అన్నిటికంటే ముఖ్యమైన రచన ఏమిటంటే, గోర్కీ **'అమ్మ'** నవలకు శివరామకృష్ణ చేసిన నాటకీకరణ. ఏడు రంగాలుగా 40 పుటలలో వున్న ఈ నాటకంలో కొన్ని పుటలు శిథిలమైనాయి. ఈ నవలతో ఉత్తేజితులైన శివరామకృష్ణ తన 'మృత్యుంజయులు'

నవలలో అమ్మలాంటి పాత్రను సృష్టించారు. రష్యన్ పేర్లతో కాకుండా, తెలుగు పేర్లతో, తెలుగు వాతావరణం రంగరించి రాసిన ఈ నాటకం ఇన్నాళ్ళూ శివరాం గారి ఫైళ్ళలో నిద్రపోవడం విచారకరమైన విషయం.

1986లో కళాదృష్టి లేక మోడల్ అనే నాటికలో చిత్రకారుడైన మామగారు ఒక గర్భిణీ స్త్రీని నగ్నంగా చిత్రించాలని, దానికి మోడల్ లభించక బాధపడుతుంటే, గర్భిణీగా వున్న కోడలే మోడల్‌గా వ్యవహరిస్తే, మొదటి తండ్రిని, భార్యని అనుమానించినా ఆ తర్వాత భర్త కళాదృష్టి అని అర్థం చేసుకోవడం వస్తువు.

ఇవేగాక ఆయన 'విద్యారణ్యం' శీర్షికతో రాసుకున్న సినిమా స్క్రీన్‌ప్లే, ఇంకా వివిధ కథలకూ, నాటికలకూ, సినిమాలకూ పనికివచ్చే వాటి క్లుప్త రూపాలూ వున్నాయి. ఆయన చదివిన ప్రతి పుస్తకంలోని విషయమూ కుప్లంగా రాసుకునే అల వాటున్నట్లు ఒక పుస్తకం సాక్ష్యమిస్తోంది. ప్రముఖ రచయితల రచనల నుండి గుర్తుంచుకోవాల్సిన వాక్యాలను ఒక పుస్తకంలో ఎక్కించుకున్నారు.

ఈ విధంగా-సాహిత్యంలో వివిధ ప్రక్రియల్లో నిరంతర సాహితీ వ్యవసాయం చేసినవాడు శివరామకృష్ణ. *




# నన్ను అనువాదకుణ్ణి చేసిందే బొల్లిముంత

**- సహవాసి**

**(అనువాదకునిగా సహవాసి వాసి తెలిసిందే. సహవాసి అసలు పేరు జంపాల ఉమామహేశ్వరరావు. సాహితీ వ్యాసంగాన్ని ప్రారంభించిన తొలి రోజుల్లో ఆయన కవితలు, కథలు రాశారు. దరిమిలా ఆయన అనువాద వ్యాసంగం ఎలా చిగురెత్తిందో ఆయన మాటల్లోనే. - సంపాదకుడు)**

"కామ్రేడ్, మీరొక పనిచేసి పెట్టాలి...." అంటూ ఓ క్షణం ఆగారు బొల్లిముంత శివరామకృష్ణగారు.

"చెప్పండి" అని నేను అనబోయేలోగా ఆయనే చెప్పారు నాపైన పెట్టదలచిన బాధ్యతేమిటో.

"మన "జనసాహితి" కాస్త ఆర్థిక యిబ్బందిలో పడింది. అది కష్టాల్లోంచి గట్టెక్కి, మళ్లీ తలెత్తటానికి నాకో ఆలోచన తడుతోంది. 'జనసాహితి' తరఫున ఓ మంచి పుస్తకం ప్రచురించాలి. మేలు ప్రతులు లైబ్రరీలకు, మామూలు కాపీలు మనం బాకీపడ్డ పుస్తక సంస్థలకు పంపిణీ చేస్తే నాలుగు డబ్బులూ చేతిలో ఆడతాయి, బాకీలూ తీరిపోతాయి. మీరు చేయాల్సిందల్లా దాస్తోవిస్కీ నవల "The Insulted and the Humiliated" ని తెలిగించి యివ్వాలి".

ఇది 1958 నాటి సంగతి. తెనాలి 'జనసాహితి' బుక్ షాపు బోస్ రోడ్డులో వుండేది. ఇంచుమించుగా ఇప్పుడు నవయుగ హోటల్ ఉన్న ప్రాంతం. అభ్యుదయ సాహిత్యాభిమానులైన పాఠకుల కద అప్పట్లో 'అడ్డా'. మరీ చెప్పాలంటే-కమ్యూనిస్టు పార్టీ, తదనుబంధ సంస్థల కార్యకర్తలు, సానుభూతి పరులు తరచు వస్తూ, పోతుండే చోటు. జెట్టి వెంకటేశ్వరరావుగారు నిర్వహిస్తుండేవారు.

అప్పటికి బి.ఏ. ఆనర్స్ (పాలిటిక్స్) ఆంధ్ర విశ్వ కళాపరిషత్తులో పూర్తిచేసి ఉద్యోగాన్వేషణలో వున్నాను. బొల్లిముంత గారు నన్ను దాస్తోవిస్కీ నవలని అనువదించి పెట్టమని కోరగానే మొదట నేను అవాక్కయ్యాను. అనువాద ప్రక్రియలో నాకున్న అనుభవం అంతంత మాత్రం! టాగోరు, పెరల్‌బక్, ప్రేంచంద్ కథలు మూడు, నాలుగు తెలుగు చేయడం మించి అనువాద ప్రక్రియలో చేయి తిరిగినవాణ్ణికాను. సిద్ధహస్తులైన అనువాదకులెందరో ఆయనకు తెలిసినా, అర్భకుణ్ణి నన్నే ఎందుకడిగారో నాకిప్పటికీ జవాబు తెలీని ప్రశ్న. నా సంకోచం ఆయనకు అర్థమైంది.

నా భుజం తట్టారు. నాకు ఆత్మవిశ్వాసం కలిగించారు. ఎన్ని యోజనాల దూర ప్రయాణమైనా మొదటి అడుగుతో ప్రారంభమవుతుందన్న సామెత యిచ్చిన స్ఫూర్తితో నేను ఆ నవలను అనువదించటానికి శ్రీకారం చుట్టాను. 1959 ప్రథమార్థంలో 'తిరస్కృతులు' అచ్చయి మార్కెట్‌లోకి వచ్చింది. కీ.శే. ముత్తేవి మాధవాచార్యులుగారు కళ్లలో వత్తులేసుకుని ప్రూఫులు దిద్దారు. శ్రద్ధగా ఆయన ప్రెస్‌వర్కు చూడబట్టే పుస్తకం సకాలంలో వెలువడింది.

అలా నా సాహిత్య వ్యాసంగం మేలు మలుపు తిరిగింది. అందుకు బొల్లిముంత గారికి, మాధవాచారిగారికి నేనెంతో రుణపడి వున్నాను. బొల్లిముంతగారు తెనాలి తాలూకా కమ్యూనిస్టు పార్టీ కార్యదర్శిగా వున్నప్పటి నుంచీ తెలుసు. మా ఊరి (దుగ్గిరాల) పంచాయతీబోర్డు ఎన్నికలలో పరుచూరి లలితాప్రసాద్‌గారు కమ్యూనిస్టు పార్టీ మద్దతుతో పోటీ చేసిన సందర్భంగా బొల్లిముంత దుగ్గిరాల చాలాసార్లు వచ్చారు. వారి ఉత్తేజకర ప్రసంగాలు విని నేను ఆయన అభిమానినయ్యాను. 1950లలో ప్రారంభమైన మా పరిచయం, క్రమంగా స్నేహంగా మారి వరన్వరానుబంధం వికసించింది.

జీవిత పోరాటక్రమంలో నేను హైదరాబాదులో స్థిరపడటం, బొల్లిముంతగారు సినిమాలకు స్క్రిప్టు రాయడానికి చెన్నై తరలివెళ్లడం కారణంగా మా యిద్దరి మధ్య సంబంధాలు తగ్గిపోయాయి. చాలా సంవత్సరాలపాటు అసలు కలుసుకోనేలేదు. అంచేత కావచ్చు-డిశంబరు 12, 1994న 'ఉదయం' దినపత్రికలో "అంటుగట్టడంలో అందెవేసిన చెయ్యి-సాహిత్య 'సహవాసి'" అని ప్రముఖ యువకవి యార్లగడ్డ రాఘవేంద్రరావు నాతో జరిపిన ఇంటర్వ్యూ వచ్చింది. అందులో ఇంట్రోలోనూ, నా ఇంటర్వ్యూలోను నేను అనువాదకుణ్ణి కావటానికి బొల్లిముంతగారు ఎలా కారకులో ప్రస్తావించాను. అది చూసి ఆయన మొదట చాలా ఆశ్చర్యపోయారట. సహవాసిగా నా కలం పేరు ఆయనెరగరు. 'జనసాహితి' కోసం నేను దాస్తోవిస్కీ నవలను అనువదించిన సంగతి మర్చిపోయారు. ఇంటర్వ్యూ చదివాక ఆయన నన్ను జ్ఞాపకం తెచ్చుకున్నారు.

ఆరేడేళ్ల క్రితం నేను బొల్లిముంత గారిని హైదరాబాదులో కలుసుకున్నప్పుడు, పాత సంగతులు తిరగేశాం. పాత జ్ఞాపకాలలో తడిశాం. 'యెన్నలంతా మేసి యేరు నెమరేసిన' మాదిరి అనుభూతికి లోనయ్యాం.

ఇప్పుడు నేను హైదరాబాదు వదలిపెట్టి, తెనాలిలో స్థిరపడటానికి రెండు రోజుల ముందే (7 జూలై, 2005) బొల్లిముంత మరణించడం గొప్ప విషాదం. ఆయన మరణానికి నా సంతాపం తెలియజేస్తున్నాను. *

# బొల్లిముంత శివరామకృష్ణ మృతికి అభ్యుదయ రచయితల సంఘం సంతాపం

నిబద్ధత, నిమగ్నత, నిజాయితీ, నిరాడంబరలతో ఏడు దశాబ్దాలపాటు లక్ష్యసిద్ధిలో ప్రజా జీవితాన్ని ఆదర్శవంతంగా గడిపిన బొల్లిముంత శివరామకృష్ణ తెనాలి తాలూకా చదలవాడ గ్రామంలో 1920 నవంబర్ 27వ తేదీన జన్మించారు. 85వ ఏట 2005 జూన్ 7వ తేదీన తెనాలిలో అమరులైనారు. మితమైన సంపాదనతో లోకహితమైన జీవితాన్ని గడిపిన ఉత్తమ కమ్యూనిస్టు, ఆదర్శ అభ్యుదయ రచయిత, ప్రజా కళాకారుడు శివరామకృష్ణ.

బాల్యంలో సంస్కృత భాషాభ్యాసంచేసి ఉపాధ్యాయుడిగా జీవనరంగంలో అడుగిడిన శివరామకృష్ణ 1946లో కమ్యూనిస్టు ఉద్యమంచే ప్రభావితుడై వామపక్ష భావాలు ఆకళింపుజేసుకుని రచయితగా, కళాకారుడిగా, సామాజిక అధ్యాపకుడిగా రూపొందారు. 1943 ఫిబ్రవరి 13, 14 తేదీలలో తెనాలిలో జరిగిన ప్రథమాంధ్ర అభ్యుదయ రచయితల సంఘంతో కొద్దికాలానికే గరిష్ట సంబంధాలు ఏర్పరుచుకుని అభ్యుదయ రచయితల సంఘంలో క్రియాశీలక పాత్రను నిర్వహించటం ప్రారంభించిన బొల్లిముంత రాష్ట్ర ప్రధాన కార్యదర్శిగా, ఉపాధ్యక్షునిగా, కార్యకర్తగా సైతం తదనంతర కాలంలో అరసానికి సేవలందించారు.

అభ్యుదయ రచయితగా తెలంగాణా విమోచన పోరాట కాలంలో తెలుగు నవలా చరిత్రలో చిరస్థాయిగా నిలిచిపోయే 'మృత్యుంజయులు' నవలను రచించారు. ఈ నవల తెలంగాణా సాయుధ పోరాటకాలంలో 1947 సంవత్సరంలో వెలువడిన తొలి నవల. అంతేగాక తెలుగులో తొలి రాజకీయ నవలగా కూడా గుర్తింపు పొందింది. ఎందరినో చైతన్యపరచి పోరాటోన్ముఖుల్ని చేసింది. బొల్లిముంత శివరామకృష్ణ పలు సామాజిక సంఘటనలకు స్పందించి రాసిన కథలలో వ్యంగ్యం నిండి వుండేది. బుర్రకథ, హరికథ, పద్య నాటకం వంటి ప్రక్రియలను చేపట్టి వాటిని ప్రజాపక్షంగా తీర్చిదిద్ది తిరిగి ప్రజలవద్దకే చేర్చిన అసలు సిసలైన ప్రజా రచయిత బొల్లిముంత శివరామకృష్ణ. బొల్లిముంత రాసిన పలు నాటికలు, నాటకాలను రాష్ట్ర వ్యాపితంగా విజయవంతంగా వేలాది ప్రదర్శనలను ఆంధ్రప్రదేశ్ ప్రజానాట్య మండలి ప్రదర్శించింది. అవి అమితంగా జనసామాన్యం మన్ననలను పొందాయి. శివరామకృష్ణ ప్రజానాట్య మండలిలో కూడా క్రియాశీలక పాత్ర వహించారు. శివరామకృష్ణ నగారా, ప్రతిభ, ప్రగతి, ప్రజాపక్షం మొదలగు ప్రగతిశీల పత్రికల సంపాదకునిగా తెలుగు పత్రికారంగంలో నూతన ఒరవడిని సృష్టించారు. నగారా పత్రికను ప్రభుత్వ నిర్బంధ, నిషేధాల మధ్య నడిపారు.

బొల్లిముంత శివరామకృష్ణ భారత కమ్యూనిస్టు పార్టీ కార్యకర్తగా అజ్ఞాతవాస జీవితాన్ని గడిపారు. నిర్బంధాలకు కూడా గురయ్యారు. పార్టీలో వివిధ హోదాలలో పని చేశారు. తాను విశ్వసించిన మార్క్సిజం–లెనినిజం భావజాలానికి అనుగుణంగా ఆదర్శజీవితం గడిపిన వ్యక్తి శివరామకృష్ణ. చలన చిత్రరంగంలో ప్రవేశించి పలు సినిమాలకు కథ, సంభాషణలను సమకూర్చి పేరు ప్రఖ్యాతులు గడించిన శివరామకృష్ణ సినిమారంగం ఏనాడైతే వినోదం, విజ్ఞానం పరిధులను దాటి ప్రమాదకరస్థాయికి చేరిందో ఆనాడే ఆ రంగం నుండి వైదొలగారు.

సగటు జీవితపు అతుకుల బ్రతుకుల అగాధాలను, అశేష జనసామాన్య కన్నీళ్లను కథలుగా, కావ్యాలుగా మలుస్తూ తెలుగు సాహిత్య చరిత్రలో చిరస్థాయిగా నిలిచిపోయే రచనలుచేసి, చేస్తూ ముందుకు సాగిపోతూ 'మంచి అన్నది పెంచుమన్న' మహనీయుల ఆశయాల సాధనలో నిరంతరం నిర్విరామంగా కృషి చేసిన బొల్లిముంత శివరామకృష్ణ నేటి తరానికి రేపటి తరానికి దీప్తి, స్ఫూర్తి.

బొల్లిముంత శివరామకృష్ణ రచనలు 'మృత్యుంజయులు' నవలతో సహా నేడు అలభ్యం. ఈ తరానికి, రేపటి వారసత్వానికి వారి రచనలు పరిచయం కావలసిన అవసరముంది. దీనిని దృష్టిలో వుంచుకొని బొల్లిముంత సమగ్ర రచనల సంపుటాలు వెలువడాల్సిన అవసరాన్ని అరసం గుర్తిస్తోంది. ఈ కార్యభారాన్ని స్వీకరించాల్సిందిగా విశాలాంధ్ర ప్రచురణాలయానికి సవినయంగా విజ్ఞప్తి చేస్తోంది. బొల్లిముంత ఆశయాలను ముందుకు తీసుకువెళ్ళటానికి అరసం కృషి చేస్తోంది.

బొల్లిముంత శివరామకృష్ణ మృతికి ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం ప్రగాఢ సానుభూతిని ప్రకటిస్తోంది. విప్లవ జోహార్లర్పిస్తోంది. వారి కుటుంబసభ్యులకు, ఆప్తులకు, అభిమానులకు సానుభూతిని వ్యక్తపరుస్తోంది.

ప్రొఫెసర్ ఎస్వీ సత్యనారాయణ
అధ్యక్షులు

పెనుగొండ లక్ష్మీనారాయణ
ప్రధాన కార్యదర్శి

ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం (అరసం)

---

# బొల్లిముంత శివరామకృష్ణ మరణానికి జనసాహితి సంతాపం

వీరతెలంగాణా విప్లవ పోరాటం రగులుతూండిన కాలంలోనే ఆ పోరాటంపై వెలువడిన తొలి నవల 'మృత్యుంజయులు' రచించిన కామ్రేడ్ బొల్లిముంత శివరామకృష్ణ (85) 2005 జూన్ 7వ తేదీనాడు మరణించారు. చరిత్రను సృష్టించిన ప్రజా కళాకారుడు చరిత్రగా మారిపోయాడు.

కొద్దిపాటి బడి చదువే అయినా కామ్రేడ్ శివరామకృష్ణ తన జీవిత సంఘర్షణ నుండి స్వయంకృషిని అలవరచుకుని ప్రగతిశీల రచయితల తొలి శ్రేణిలో నిలిచారు. 1948-51 సంవత్సరాలనాటి అత్యంత క్రూర అణచివేతల కాలంలో ఉద్యమ, నిర్మాణ కృషిలో నిమగ్నులైనారు. కథ, నవల, నాటిక, నాటకం, పద్య నాటకాలు, సినిమాల, పాటల రచనలతో బహుముఖ ప్రజ్ఞను ప్రదర్శించారు. అరసం, ప్రజా నాట్యమండలి, రైతుకూలీ ఉద్యమ నిర్మాణరంగాల్లో క్రియాశీలంగా కృషి చేశారు. సామాజిక ఉద్యమాలు, పోరాటాల నుండి ఉత్తమ కళాకారులు ఆవిర్భవిస్తారనటానికి ఒక మంచి ఉదాహరణగా కామ్రేడ్ శివరామకృష్ణ నిలిచారు. వారిలోని ఉత్తమ గుణాలను ముఖ్యంగా స్వయంకృషితత్వాన్ని సామాజిక నిబద్ధత, నమ్రతలను నూతన తరాలు గ్రహించి అలవరచుకోవడమే ఆయనకు నిజమైన నివాళి.

వారి మరణానికి జనసాహితి సంతాపం ప్రకటిస్తోంది. కుటుంబసభ్యుల విచారంలో పాలు పంచుకుంటోంది.

- రాష్ట్ర కార్యవర్గం




# అరవిందగుప్తా బొమ్మల పుస్తకాలు

**బాలలూ!** అరవిందగుప్తా మీకోసం ప్రచురించిన బొమ్మల పుస్తకాలలో బొమ్మలు ఎలా వేయాలో నేర్పిస్తున్నారు. మీకు నచ్చిన బొమ్మ మీరు ఒక్కరే వేయవచ్చు లేదా ముగ్గురు, నలుగురు కలిసి ఈ పుస్తకాలు చూస్తూ ఎవరికివారు బొమ్మలు-ఎవరి ఆలోచన ప్రకారం వారు వేయవచ్చు.

మీరు ఎంత ఆలోచించిగీస్తే-ఎంత కష్టపడితే అన్ని మంచి బొమ్మలు, అన్ని ఎక్కువ బొమ్మలు వస్తాయన్నమాట. ఎక్కువెక్కువ బొమ్మలు వేయాలంటే మీ టీచరు ఎదురుగా గదిలో కూర్చుని మీరొక్కరేవేస్తే బాగా రావు. మరి ఎట్లా? గది బయటకు రండి. ప్రకృతిని చూడండి. ప్రకృతి అంటే చెట్లు, చేమలూ, జంతువులు, పక్షులు, కీటకాలు, కొండలు, నదులు మొదలైనవన్నమాట. మీ ఎదురుగుండా లేని ప్రకృతినీ, ఎప్పుడో మీరు చూసిన ప్రకృతిని కూడా గుర్తు తెచ్చుకుంటూ వాటిని బొమ్మలుగా వేయాలి.

అరవిందగుప్తా మొదటి పుస్తకం పేరు 'వేలిముద్రలు-వేల బొమ్మలు'. ఇది చాల ఆసక్తికరంగా వుంటుంది. గుప్తా మామయ్యకు ఎంత మంచి ఆలోచన వచ్చిందో అన్పిస్తుంది. వేలిముద్రలు వేయడం, మీ చుట్టూవున్న వారిచేత వేయించడం, దాని ఆధారంగా బొమ్మని వేయడం. ఆ బొమ్మకి చెవులు, మీసాలు, చేతులు, కాళ్ళు, తోకలు తగిలించడం, వేలిముద్ర ఎటువైపు నుంచి ఎటువైపు వేశావో గమనించి, అది ఏ బొమ్మకు సరిపోతుందో ఆలోచించాలి.

ఈ బొమ్మల పుస్తకం తెరవగానే మీకు ఒక మంచి పాట కన్పిస్తుంది. ముందు ఆ పాటని నేర్చుకొని గొంతెత్తి పాడండి.

ఇంకో పుస్తకం పేరు 'ఆకులతో జూ!' ఇదీ మన మెదడుకు మేత పెడ్తుంది. దొరికిన రకరకాల ఆకులను తెచ్చి పాత వార్తా పత్రికపైన అంటించడమే మనం చేసే పని. ఎన్ని రకాల ఆకులు సంపాదిస్తే అన్ని రకాల బొమ్మలు తయారు చేయవచ్చు. మనం జంతువులను, పక్షులను వూహించుకుంటూ చేయాలి. ఈ పుస్తకంలో కూడా మరో మంచి పాట వుంది.

ఈ పుస్తకాలను జనవిజ్ఞాన వేదిక, హైదరాబాద్ బుక్ ట్రస్టువారు కలిసి మనకోసం ప్రచురించారు. ఒక్కో పుస్తకం ధర ఐదు రూపాయలే. ఈ క్రింది చిరునామాకు రాసి తెప్పించుకోండి.

మీ మామయ్య,
**పినాకిని**

జి.మాల్యాద్రి,162-విజయలక్ష్మినగర్, నెల్లూరు

# గోపి-గేద-గడ్డి

**వి.శాంతి ప్రబోధ**

డియర్ చిన్నీ...

ఏం చేస్తున్నావ్...సెలవుల్లో కబడ్డీ నేర్చుకోవాలనుకున్నావ్ కదా? మొదలుపెట్టావా....?

ఆ....కబడ్డీ అంటే గోపీ గుర్తొచ్చేడు. అరే గోపి ఎవరో నీకు చెప్పనేలేదు కదూ. నేనీ మధ్య చైల్డ్ కన్సల్టేషన్‌కి వెళ్ళాను చూడు అక్కడ పరిచయమయిన అబ్బాయి. గోపి 5వ తరగతి చదువుతున్నాడు. అతనికి ఆటలు, చదువు అంటే చాలా ఇష్టమంట. కానీ ఆడుకోవడానికీ టైం ఉండదంట.

ఆరోజు...అంటే చైల్డ్ కన్సల్టేషన్‌కి వెళ్ళిన రోజు భవిష్యత్తులో మీ గ్రామం ఎలా ఉండాలనుకుంటున్నారు అని బొమ్మల రూపంలోగానీ, వ్యాసరూపంలోగానీ, నాటిక రూపంలోగానీ చెప్పొచ్చు అని ఆంటీ చెప్పారు. అప్పుడు గోపి నేను రాస్తాను అని రాశాడు. అందులో గేదెలు మేయడానికి స్థలం లేదు. స్థలం కావాలి అని అడిగాడు. గేదెలకు లేకపోతే ఏమౌతుంది అన్నప్పుడు అవి ఆహారం లేకపోతే చనిపోతాయి కదా....! చనిపోతే చనిపోనీ...అంటే...

అవి చనిపోతే ఎలా...చనిపోకూడదు. మనకి పాలు ఇస్తున్నాయికదా వాటికి సరైన ఆహారం మనం ఇవ్వాలి కదా....ఆ విషయం మీ అమ్మ, నాన్న చూసుకుంటారు కదా. నీకెందుకు బాధ? అన్నప్పుడు నీకెందుకు అంటారేంటి? గేదె మేయడానికి గడ్డిలేక బాధ నాకు కాక మరెవరికుంటుంది? గేదెను మేపడం కోసం నన్ను బడి బందు చెయ్యమంటున్నారు. నేను బడి బంద్‌బెట్ట సదువుకుంటనని లొల్లి చేస్తి. అఖరికి బడికిపోయి వచ్చినంక రోజు రెండు మోపుల గడ్డి తేవాలి. అంటే తెల్లారి సాయంత్రం దాకా మా బర్రెకు సరిపోను తేవాలి. లేకుంటే బడి బంద్. అందుకే బడి ఇడ్వంగానే పొలాలెమ్మట బోయి గెట్ల మీద గడ్డి కోసుకొని రెండు మోపులు కడ్త. ఒకటి నేను ఎత్తుకొస్త. ఇంకొటి మా అమ్మ పనికెల్లి వచ్చేటప్పుడు తెస్తది. నాకు ఆటలాడుకొనుడు అంటే మస్తు ఇష్టం. కానీ ఆడ్కునెతందుకు తీర్కే అయితలేదు. ఆదివారం ఆడుకుందం అనుకుంట. కానీ ఆదివారం బర్రెని ఇప్పాలి. దినాం కట్టేసి ఉంటది గద. ఆదివారం ఇప్పకుంటే వొప్పడు మా అయ్య. గిట్లనే బర్రెనిప్పి పొలాల పొంటి తిప్పబట్టి. నాతోని నా దోస్తు సత్తిని కూడా తీస్కపోయిన. బర్రెను మేపుకుంటూ ఆడుకున్న. ఆ ఆటల మేం ఉన్నం బర్రె పొలంలోదిగి అరి అంత (వరి పొలం) తినె. మడి ఖతం బెట్టె. దొరోల్ల జీతగాడు ఉరికొచ్చి నన్ను మస్తుకొట్టిండు. ఆ పొద్దుకెల్లి నేను ఆడ్తలేను. నేను ఎప్పటికన్న ఆడుకుంటనో లేదో. మా బడిల సార్లు సుత ఆడిపియ్యరు. మూడు మూడున్నర అయిందంటే సాలు బస్ అస్తదని ఉర్కుతరు అంటూ ఆటల పట్ల తనకున్న కోరికని, తన గోడు వెళ్ళబోసుకున్నాడు గోపి. అతన్ని చూస్తే నాకు జాలేసింది. ఆటపాటలకు దూరమై బతుకు పోరులో నలిగిపోయే బాలలెందరో కదా...

మరిక ఉంటాను...

ప్రేమతో నీ,

చిన్నా

భావ వీచికలు సౌజన్యంతో

ప్రచురణ: బాల్య, 1-9-642/7
మసీదు ఎదురుగా, విద్యానగర్,
హైదరాబాదు-44

# తొలి మానవులు, ప్రకృతి

డా॥ కొడవటిగంటి రోహిణీ ప్రసాద్

మనుషులకూ, తక్కిన ప్రాణులకూ తమ గురించీ, పరిసరాలను గురించీ కొంత అవగాహన ఉంటుంది. ఏ జంతువైనా చుట్టు పక్కల జరుగుతున్న సంఘటనలను గమనిస్తూ, తన పిల్లలను ప్రమాదాల నుంచి కాపాడే ప్రయత్నం వంటిది చేస్తుంది. పక్షులు గుడ్లుపెట్టే ముందు గూడు కట్టడం మొదలు పెడతాయి. వీటిలో కొన్ని చర్యలు సమయానుసారంగా, యాంత్రికంగా జరిగి పోతూ ఉంటాయి. కొన్ని విషయాల్లో కొంత ఆలోచన అవసరమౌతుంది. జంతువులు కూడా కొన్ని పరిస్థితుల్లో రెండు, మూడు పద్ధతులలో, మార్గాలో ఎదురైనప్పుడు వాటిలో ఏదో ఒకదాన్ని ఎంచుకోవలసి వస్తుంది. కానీ ఇవన్నీ అప్పటికప్పుడు జరిగే ప్రక్రియలు. ముందుగా ఆలోచించి ఆ ప్రకారంగా ప్రవర్తించడం మనుషులు మాత్రమే చెయ్య గలరు. ఉదాహరణకు రాబోయే చలికాలానికి అవసరమైన జంతువుల చర్మాలను సేకరించి ముందుగానే దాచుకోవడం వంటి పనులు మనుషులకే సాధ్యమయింది. ఇటువంటి ప్రత్యేకత మనుషులకు శరీరధర్మాలవల్ల అబ్బలేదు. ప్రకృతి కలిగించే ఇబ్బందుల ఒత్తిడి వల్ల కలిగింది.

గుహల్లో తలదాచుకుంటూ, చలిలో నిప్పుచేసి ప్రాణాలు కాపాడుకుంటూ బతకసాగిన తొలి మానవులు తమను గురించీ, ప్రకృతిని గురించీ ఆలోచించ సాగారు. మనుగడకోసం ప్రకృతిని పరిశీలించడం అలవాటు చేసుకున్నారు. రాత్రికీ, పగటికీ తేడాలనూ, సూర్యచంద్రుల కదలికల్లో భేదాలనూ, రుజువులను బట్టి చెట్లూ, చేమలూ, పక్షులూ, జంతువులూ వగైరాలలో కలిగే మార్పులనూ గుర్తించ సాగారు. స్త్రీ పురుషుల్లో తేడాలనూ, వయసుతో తమ శరీరాల్లో కలిగే పరిణామాలనూ, పిల్లలు పుట్టే పద్ధతినీ క్రమంగా అర్థం చేసుకోసాగారు. ప్రకృతిలో తమకు లోబడేవీ, లోబడనివీ ఉన్నాయని తెలుసుకున్నారు. కార్య-కారణ సంబంధాలు అవగాహనకు వచ్చాయి. తిక్కరేగిన జంతువు తిరగబడుతుంది. అటువంటి లక్షణాన్ని మనకు అనువుగా చేసుకోవచ్చు కూడా. కానీ "కారణం లేకుండా" ఉరిమే ఉరుములూ, మెరుపులూ, కురిసే వానలూ, మంచూ, వడగళ్ళూ, కార్చిచ్చులూ వగైరాల మాటేమిటి? కనబడని శక్తిమంతు డెవరికైనా తిక్కరేగిందా? అమాయకులైన తొలి మానవులకు ఇలాంటివన్నీ అతీంద్రియ శక్తులుగా అనిపించడంలో ఆశ్చర్యం లేదు. ప్రకృతిని "శాంతింప"జెయ్యగలిగితే బతుకు జీవుడా అని ఊరుకోవచ్చు. మతపరమైన భావనలకు ఇదే నాంది అయింది. చలి నుంచి వెచ్చగా కాపాడే సూర్యుడే ఒక్కొక్కప్పుడు వడదెబ్బకు కారణం కావచ్చు. "ఓర్పు"తో "అన్నీ సహించే" భూమాత ఉన్నట్టుండి అగ్నిపర్వతాలూ, భూకంపాలూ సృష్టించి "కోపాన్ని" ప్రకటిస్తుంది. తమకు అదుపులో లేని ఇలాంటి శక్తులే ఆదిమానవులకు తొలి దేవతలుగా రూపొందాయి. జొరాస్ట్రియన్ లకూ, పార్శీవారికీ, తొలి ఆర్యులకూ అగ్ని దేవుడు ముఖ్యం. నిప్పు, వానలూ, నదులూ వగైరాల మీద ఆధారపడడం తగ్గగానే దేవతలుగా ఈ ప్రకృతిశక్తుల ప్రాధాన్యత తగ్గిపోయింది.

తొలి మానవులు అనాగరికదశలో ఉన్నప్పటినుంచీ కూడా వారు పోగుచేసుకున్న

సైన్స్, జ్ఞానం, విజ్ఞానం వగైరాలన్నీ ఉత్పత్తికి సంబంధించినవిగానే ఉంటూ వచ్చాయి. చలి కాచుకునేందుకు నిప్పు చేసుకున్నా, ఒళ్ళు కప్పుకునేందుకు జంతువుల చర్మాలను కట్టుకున్నా ఆ విద్యలన్నీ వారి మనుగడకు అవసరమైనవిగానే ఉండేవి. వారి అవగాహనకు తోడ్పడే సాధనాలేవీ లేని ఆ దశలో ప్రకృతిని అర్థం చేసుకునేందుకు వారికి ఉపయోగపడినవల్లా వారి బుద్ధీ, మనసూ మాత్రమే. మృగప్రాయమైన జీవితాలనుంచి బైటపడేందుకు ఎన్నో కష్టాలు పడుతున్న ఆ యుగంలో బలమైన ప్రకృతి శక్తులకు ఎదురొడ్డి నిలవడానికి అటువంటి అవగాహనకై వారు ఎంతో ఆరాటపడవలసి వచ్చింది. ఈ పరిస్థితి ఏదో ఒక రూపంలో అనేక శతాబ్దాలు కొనసాగింది. ("సత్యకాలం" గురించి మనవాళ్ళు ఎన్ని ఊహించుకున్నా, పురాణాల గురించిన అబద్ధపు టీ.వీ. సీరియల్ దృశ్యాల్లో అట్టతో చేసిన తామర పువ్వు మధ్యలో బ్రహ్మ కూర్చుని వరాలిచ్చి నట్టు ఎన్నిసార్లు చూపినా గడిచిపోయిన మానవ చరిత్ర మాత్రం చెప్పరాని కష్టాలతో కూడుకుని ఉండేదనేదే నిజం).

ఏది ఏమైనా దేవుళ్ళ గురించిన భావనలు మొదటగా అంకురించినది ఆ చీకటి యుగంలోనే. (పౌరాణిక చిత్రాలు తీసేనాటికి ఇంకా చీకటి యుగం అయిపోలేదని అనుకోవాలి). ఎవరో తత్త్వవేత్త చెప్పినట్టు ఒక చిన్న పేడపురుగునైనా సృష్టించలేని మానవుడు లెక్కలేనంతమంది దేవుళ్ళని సృష్టించుకున్నాడు!

పురాణాలన్నీ మనిషి ప్రకృతిశక్తులను ఓడించినట్టు అభూతకల్పనలు చేసే పరిస్థితి లోనే ఉద్భవిస్తాయనీ, నిజంగా వాటిని లోబరుచుకున్నప్పుడు వాటితో పనితీరి పోతుందనీ మార్క్స్ అన్నాడు. (మరి సీరియల్ నిర్మాతలు ఏమంటారో?). ఇంద్రుడు తలుచుకుంటే కుండపోతగా వర్షం కురిపించ గలడు. అప్పుడు అందరూ తడిసిపోకుండా కృష్ణుడు అమాంతంగా గోవర్ధన పర్వతం ఎత్తేస్తాడు. అగస్త్యుడి బాటకి అడ్డొచ్చిన వింధ్య పర్వతం తల వంచేస్తుంది. మునులకి కోపం వస్తే దేన్నైనా భస్మీపటలం చెయ్యగలరు. సముద్రాలు ఇంకిపోతాయి. ఇలాంటివి పశ్చిమ సంస్కృతుల్లోనూ ఉన్నాయి. మశూచి వంటి రోగాలను "అమ్మవారు"గా భావించినది మనదేశంలోనే కాదు, గ్రీస్, క్రీట్, రోమ్ మొదలైన ప్రాచీన నాగరికతల్లోనూ, దక్షిణ, మధ్య అమెరికా సమాజాల్లోనూ, కొన్ని దేశాల్లో మధ్యయుగాల్లోనూ నరబలి ఇవ్వడం ఆచారంగా ఉండేది. ప్రాచీనకాలంలో వందల మంది చిన్న పిల్లలను బలి ఇచ్చిన భయంక రమైన సంఘటనలకు సాక్ష్యాలు కన బడతాయి. తిండి పెడితే తృప్తి చెందని వారుండరని ఆటవికదశలోనే మనిషికి తెలును కనక ఏవో నైవేద్యాలుపెట్టి ప్రచండమైన శక్తులను మంచిచేసుకునే ప్రయత్నాలు ఆదిమసంస్కృతులన్నిటిలోనూ జరిగాయి. ఈనాటికీ దేవుడికి పెట్టకుండా భోజనం చెయ్యనివారున్నారు. అది ఎంత ఆటవిక సంప్రదాయమో వారికి తెలియక పోవచ్చు. ఇదంతా "సింబాలిక్" అనీ, దీని వెనక ఉండే ఆధ్యాత్మిక భావాలనే మనం స్వీకరించాలనీ నేటి ఆస్తికులు మనని నమ్మిస్తూ ఉంటారు. ఎవరెన్ని చెప్పినా ఈ అభూతకల్పనల్లోనూ, మూఢనమ్మకాల్లోనూ కనబడేది అపరిపక్వమైన మానవ మేధస్సు ఒక్కటే.

జంతువులకు మతాలూ, మంత్రాలూ ఉండవు. మనిషికీ, గొడ్డుకీ అదే తేడా. ఇవన్నీ లేనివాడు గొడ్డుతో సమానం. జంతువులకి లేని స్పృహ, చైతన్యం, కాన్షస్‌నెస్ అన్నీ మనిషికి ఉన్నాయని తొలిరోజుల్లోనే ప్రజలు గుర్తించారు. వివేచన, వివేకం, ముందు చూపు, తరతరాలుగా పోగైన అనుభవం, ఇన్‌స్టింక్ట్‌పై ఆధారపడకుండా ఆలోచించి మరీ

ముందుకు సాగడం ఇవన్నీ జంతువుల వల్ల అయే పని కాదని వారు గ్రహించారు. అందుచేతనే మనసుకు సంబంధించిన మేధో ప్రక్రియలన్నింటికీ తొలి నుంచీ ప్రాముఖ్యత ఉండేది. (జరిగిపోయినది ఎవరికైనా గుర్తుంటుంది. జరగబోయేదాన్ని గురించి-తెలిసినట్టుగా దబాయించి మరీ-చెప్పగలిగే వాడు త్రికాలజ్ఞాని!). పాతరాతి యుగానికి చాలా ముందుగానే తొలి మానవజాతులకు తమకు గల తెలివితేటలపట్ల అవగాహన ఉండేది. అలాంటి పరిస్థితిలో కాల్పనిక ప్రపంచంలో విహరిస్తూ, ఉన్నవీ, లేనివీ ఊహించుకోవడమే ఉన్నతమైన మానవజాతి లక్షణం అని వారనుకుని ఉంటే అందులో ఆశ్చర్యం లేదు. జంతువులని చిన్నచూపు చూడడం తప్పని తెలిపినది ఆధునిక విజ్ఞానమే. శరీర నిర్మాణంలోనూ, వివిధ జీవప్రక్రియల్లోనూ మనకూ, జంతువులకూ గల తేడాలు చాలా స్వల్పమైనవని మనకీనాడు తెలుసు. జన్యువుల్లో మనకూ చింపాంజీలకూ కేవలం 2 శాతం భేదం ఉంటుంది. అందుకనే వాటి తెలివి మన చిన్న పిల్లల స్థాయిలో ఉంటుంది. కానీ వాటికి ఎంత శిక్షణ ఇచ్చినా అవి మనలాగా మాట్లాడలేవు, ఆలోచించలేవు. దీనర్థం ఏమిటంటే కేవలం జన్యువులుండగానే సరిపోదు. పరిస్థితుల ప్రాబల్యం వల్ల మనిషి జాతి కొన్ని లక్షల ఏళ్ళపాటు రకరకాలైన శరీరశ్రమ చెయ్యవలసి వచ్చింది. దాని ఫలితంగా మనిషి మెదడులో అంతకంతకూ ప్రత్యేకమైన మార్పులు కలుగుతూ వచ్చాయి. అవి మనిషిజాతిలో అనూహ్యమైన పరిణామాలకు దారితీశాయి. ఎంత తెలివైన కోతి అయినా సరే, ఆ స్థాయిని అందుకోగల ప్రసక్తే ఉండదు. ఇందులో సృష్టికర్త ప్రమేయం ఏమీ లేదు.

(ఇంకా వుంది.)

**మన తెలుగును రక్షించుకుందాం**

# అధికార భాషా సంఘం సిఫార్సులు

ఇటీవల ఎ.బి.కె.ప్రసాద్‌గారి అధ్యక్షతన కొత్తగా ఏర్పడిన అధికార భాషా సంఘం మే నెల 16న తన తొలి సమావేశం నిర్వహించి, తెలుగుభాష సక్రమ అమలుకోసం ప్రభుత్వానికి చేసిన సిఫార్సులలో ముఖ్యమైనవి కొన్ని ఈ క్రింద ఇస్తున్నాం.

- ప్రభుత్వ, ప్రైవేటు పాఠశాలలన్నింటిలోను పదో తరగతి వరకు బోధన మాధ్యమంగా తెలుగు ఉండేలా చూడాలి. ప్రైవేటు విద్యలో తెలుగును తప్పనిసరి చేయాలి.
- తెలుగును బోధన భాషగా చదివిన వారికి మాత్రమే ప్రభుత్వ ఉద్యోగాల్లో ప్రభుత్వం ప్రాధాన్యం కల్పించాలి. తెలుగు కంప్యూటర్ లిపిని ప్రభుత్వ విభాగాలన్నింటికి విస్తరించాలి.
- రాష్ట్ర సచివాలయం నుండి క్రిందిస్థాయి వరకు జారీ చేస్తున్న ప్రభుత్వ ఉత్తర్వులు, ఉత్తరాలు, పాలనా పరమైన అంశాలన్నింటిని తెలుగులోనే విడుదల చేయాలి. అలా అమలు చేయని అధికారులపై చర్యలు తీసుకోవాలి.
- స్థానిక న్యాయస్థానాలు ఇచ్చే తీర్పులు, వాదోపవాదాలు అన్నీ తెలుగులోనే ఉండాలి.
- తమిళనాడులో తెలుగును రెండో అధికార భాషగా గుర్తించేలా మన రాష్ట్ర ప్రభుత్వం చర్యలు చేపట్టాలి. తెలుగు భాషను ప్రాచీన భాషగా గుర్తించాలని కోరుతూ రాష్ట్ర శాసనసభలో తీర్మానం చేయాలి.
- వ్యాపార దుకాణాలు తెలుగులో నామ ఫలకాలు (బోర్డులు) ఏర్పాటు చేయకపోతే వారి లైసెన్సులు రద్దు చేసే అధికారం అధికార భాషా సంఘానికి కల్పించాలి.
- ప్రభుత్వ కార్యక్రమాలన్నీ 'మా తెలుగుతల్లికి మల్లెపూదండ' పాటతో ప్రారంభించి-గురజాడ 'దేశభక్తి' గీతంతో ముగించాలి.



# అశాస్త్రీయం

- తమ్మినేని అక్కిరాజు

మా వాడు నాకీ రోజు మరో చిక్కు సమస్య తెచ్చిపెట్టాడు. బడికి బయలు దేరినవాడు తక్కున వెనక్కుతిరిగి వచ్చేసి నా దగ్గర కూర్చున్నాడు. నేను ఈ రోజు స్కూల్లో చెప్పాల్సిన పాఠం నోట్సు తయారు చేసుకుంటున్నాను. నాకు మొదటి నుంచి అదో అలవాటు. నా నోట్సు ఆపేసి-

"ఏంటి! ఈ రోజు పరీక్షలు ప్రారంభం అన్నావుగా! కాస్త త్వరగా వెళ్ళాలి అన్నావు. వెనక్కి తిరిగివచ్చి నా దగ్గర కూర్చున్నా వేంటి?" అన్నాను.




మావాడు ఏడవ తరగతి చదువుతున్నాడు. వాడికి ఏదైనా కొత్త విషయం తెలిస్తే మొహమాటం లేకుండా ప్రయోగించేస్తూ ఉంటాడు.

"ఏముంది! పెళ్ళికి పోతూ పిల్లిని చంకను బెట్టుకు వెళుతున్నట్టు-ఎదురుగా 'వెధవ ముండ' వస్తుంటే నేనింకేం వెళతాను? అందుకే ఆగిపోయాను" అన్నాడు మావాడు అదురు బెదురు లేకుండా!

ఆ మాటతో నా గుండె 'గుబుక్కు' మంది. ఎదురుగా విశాలాక్షిగారు రానే వచ్చారు. మావాడు అన్నమాటలు ఆమె విన్నదేమో అని బాధ కలిగింది.

మేము విశాలాక్షిగారి ఇంట్లో అద్దెకు ఉంటున్నాం. ఆమెకు నలభై సంవత్సరాలు ఉంటాయి. రెండు సంవత్సరాలక్రితం భర్త చనిపోయాడు. మేము ఒక సంవత్సరం నుండి ఈ ఇంట్లోనే ఉంటున్నాము. మా అబ్బాయిని ఆమె ఎంతో ప్రేమగా చూసుకుంటుంది. అలాంటి వ్యక్తిని పట్టుకుని అంత మాట అనేసరికి నాకు మావాడి మీద చాలా కోపం వచ్చింది. విశాలాక్షిగారు మా ముందు నుంచే ఏదో ఆలోచిస్తున్నట్టుగా ముభావంగా లోపలికి వెళ్ళిపోయింది. సాధారణంగా అయితే మావాడిని పలకరించి వెళ్ళేదే!

ఆమెను లోపలికి వెళ్ళనిచ్చి మా వాడితో-

"నీకసలు బుద్ధుందా?" అన్నాను తీవ్రంగా.

నేను ఎందుకంత కోపగించుకున్నానో మా వాడికి అర్థం కాలేదు.

"ఏంటి డాడీ-మీరంటున్నది. ఎందుకంత కోపం?" అన్నాడు.

"ఆంటీగారిని అలా అనవచ్చా? ఆవిడ నిన్ను ఎంత ప్రేమగా చూసుకుంటుంది!" అన్నాను.

"అవును నేనంటే ఆమెకు ప్రాణం. ఇంట్లో ఏం చేసుకున్నా నేను లేకుండా తిననే తినదు".

"మరి అలాంటి ఆమెను పట్టుకుని 'వెధవముండ' అని ఎందుకన్నావ్?"

"మీరు చెప్పేది నాకేవీ అర్థం కావట్లేదు డాడీ! ఆవిడే కాదు-భర్త చనిపోయిన ఆడవాళ్ళను ఎవర్నయినా అలాగే అంటారుగా!"

మా వాడికి అర్థమయ్యేటట్లు ఎలా చెప్పాలో నాకు తెలియటంలేదు. ఇలాంటి మాటలు ఎందుకు వట్టాయా- అని మనసంతా వేదనగా తయారయిపోయింది.

"ఆమె ఎదురొస్తే నిన్ను ఆగి పొమ్మని ఎవరు చెప్పారు?

నేను కాని, మీ అమ్మకాని అలాంటి మాటలు ఎప్పుడైనా చెప్పామా?" అన్నాను.

"మీరు ఎప్పుడూ చెప్పలేదు డాడీ! నాకు కూడా నిన్ననే తెలిసింది".

"ఎక్కడ విన్నావు? ఎవరు చెప్పారు?"

"నా నోట్సు మా 'మిస్' దగ్గరుంటే తెచ్చుకుందామని నిన్న స్టాఫ్ రూమ్‌కు వెళ్ళాను. అక్కడ 'మిస్'లు, 'సార్లు' ఇలాంటి విషయాలే మాట్లాడుకుంటుంటే విన్నాను" అన్నాడు.

"వాళ్ళకు వేరే పనేమీ లేదనుకుంటా- ఇలాంటి విషయాలు మాట్లాడుకోవటం తప్పు" అని నాలో నేను అనుకున్నట్లుగా అన్నాను.

మా వాడు ఠక్కున అందుకుని-

"వాళ్ళు ఇలాంటి విషయాలే చాలా మాట్లాడారు డాడీ" అన్నాడు.

''ఇంకేం మాట్లాడారు?'' నాకు అనుమానం వచ్చి అడిగాను.

"పిల్లి ఎదురొచ్చినా, కట్టెలు ఎదురొచ్చినా, ఒంటి బ్రాహ్మణుడు ఎదురొచ్చినా, శవం ఎదురొచ్చినా, నూనెతో ఎదురొచ్చినా .... ఇంకా ఏదో అన్నారు...ఆఁ...ఎవరయినా తుమ్మినా సరే ముందుకు వెళ్ళకూడదని, కాసేపు ఆగి కూర్చుని వెళ్ళమని మాట్లాడుకున్నారు. ఒక 'సారు' అయితే పిల్లి ఎదురొస్తే ఆ రోజు ప్రయాణమే మానుకోవటం మంచిదని, పిల్లి ఎదురు చాలా ప్రమాదమని గట్టిగా వాదించారు. అందుకే ఎందుకయినా మంచిదని నీ దగ్గరకొచ్చి కూర్చున్నాను డాడీ?" అన్నాడు.

ఆ క్షణంలో మా వాడి అమాయక ముఖం చూసి నాకైతే జాలేసింది. పసిపిల్లల నిర్మల హృదయాల్లో యిలాంటి 'విషం' ఎక్కుతున్నందుకు ఎంతో బాధ కలిగింది. నిజం చెప్పాలంటే కళ్ళమ్మట నీళ్ళు తిరిగాయి నాకు. ఇలాంటి విషయాలను మా ఇంట్లో నేను గాని, మా ఆవిడగాని పొరపాటున కూడా మాట్లాడం. వీటివలన జరిగే నష్టం ఏమిటో మాకు బాగా తెలుసు. అందుకే మేము మొదటి నుండి ఎంతో జాగ్రత్తపడుతూ వచ్చాము. కాని మా వాడి దృష్టికి రానే వచ్చాయి. పైగా వాటిని ఆచరణలో పెట్టాడు కూడా!

సిద్దార్థుడిని వాళ్ళ నాన్న- మహారాజు అయివుండి- ఒంటిస్తంభం మేడలో పెట్టాడు. అయినప్పటికి- ఏవి చూడకూడదనుకున్నాడో అవి తన కుమారుడు చూడనే చూసాడు. అలాగే ఇది సమాజం. నా ఒక్కడితోటి లేదు. నేను మాత్రం మా వాడిని ఎంతని కాపాడ గలను?

పైగా మన దురదృష్టం ఏంటంటే- మంచి విషయాలు చెపితే త్వరగా ఎక్కవు- ఎక్కినా ఆచరించేవాళ్ళు ఒక్కరో, ఇద్దరో ఉంటారు. కాని ఇలాంటి చెత్త విషయాలు మాత్రం వెంటనే ఎక్కిపోతాయి. వినటానికి, ఆచరించడానికి ఎంత ఆసక్తి చూపిస్తారో! దున్నపోతు ఈనిందంటే దూడని కట్టేయమనే వాళ్ళే ఎక్కువ-అసలు దున్నపోతు ఈనడం ఏంటా? అని ఆలోచించేదెవరు? ఇలాంటి జనంతో ఆనాడు రాజారామ్మోహనరాయ్, కందుకూరి ఎన్ని బాధలుపడి ఉంటారో!

మా అబ్బాయి చిన్న పిల్లవాడు. చిన్న పిల్లలకు విచక్షణ తక్కువ- గ్రహణశక్తి ఎక్కువ. వాళ్ళ కళ్ళతో వాళ్ళు చూస్తారుగాని- వాళ్ళ బుర్రతోవాళ్ళు ఆలోచించలేరు. అందుకే ఎవరు ఏం చెప్పినా- చెప్పింది చెప్పినట్లు వాళ్ళ బుర్రలోకి ఎక్కిపోతుంది. ఆ భావజాలం నుంచి మా వాడిని కాపాడుకోవాలను కున్నాను.

"నువ్వు విన్న విషయాలన్నీ అర్థంలేనివి. పూర్వకాలంలో 'మనిషికి-ప్రకృతికి' మధ్య విజ్ఞానశాస్త్రం వెలుగుచూడని దశలో పుట్టిన విషయాలవి. మనిషి అన్నిటికి భయపడుతూ ఏదో తనకీ తెలియని అశాస్త్రీయ విషయాలన్నీ తన చుట్టు అల్లుకొని జీవించిన కాలమది. ఇప్పుడు వాటి అవసరం మనకు లేదు. పైగా

అమానుషంగా మనని మనం హింసించు కోవడానికి మాత్రమే అవి పనికి వస్తున్నాయి. విశాలాక్షి ఆంటీకి నువ్వంటే ఎంత ప్రేమ! అలాంటి ఆమె నువ్వు ఇప్పుడన్న మాట వింటే ఎంత బాధ పడుతుంది? నిన్ను దగ్గరకు పిలిచి ముద్దు పెట్టుకోగలదా? నీ మీద ఆమెకు విముఖత ఏర్పడుతుంది కదా!" అన్నాను మా వాడితో.

"అయితే నాదొక 'డౌట్' డాడీ" అన్నాడు మా వాడు.

"ఏంటో చెప్పు. నీ డౌట్లు సామాన్యమైనవి కాదు. అడుగు" అన్నాను.

"మరి నువ్వు కోప్పడకూడదు" అన్నాడు.

వీడు నా ముందు కాళ్ళకు బంధాలేసి మాట్లాడుతున్నాడు. ఏదో 'కొంపలు ముంచే విషయమే' అనుకున్నాను.

"ఏంటీ! అడగమంటే నసుగుతున్నావ్! ఏంటో అడుగు" అన్నాను కాస్త గట్టిగా! పైకి 'బింకం' చూపించానేగాని లోపల డౌటుగానే ఉంది ఏమడుగుతాడా అని! మా వాడు అసలే చురుకు కదా! దేనికి భయపడడు.

"ఏం లేదు డాడీ! మొన్న మనం 'రమ అక్క' పెళ్ళికి బాబాయిగారి ఇంటికి వెళ్ళాం కదా!" అని ఆగాడు.

"అవును వెళ్ళాం-వెళితే ఏమయింది?"

"అక్కడ పెళ్ళిలో పిన్ని-నాయనమ్మను ఏమంది?"

"అదేంటో నువ్వే చెప్పు" నా గొంతులో ధ్వని కొంచం తగ్గింది.

"తగుదునమ్మా అంటూ అన్నిటికి మీరే ముందుంటారేమిటి? ఇది శుభకార్యం. మీరు ముందుండకూడదు. లోపలికెళ్ళి మూల కూర్చోండి. అవసరమైనప్పుడు నేను పిలుస్తాను అంది" మా వాడు ఒక్క క్షణం ఆగి నా ముఖంలోకి చూసాడు. అప్పటికే నా శ్వాస పెరగటం ప్రారంభమయింది.

మా వాడు మళ్ళీ అందుకుని-

"అంతే కాకుండా బాబాయ్‌తో-'మీరయినా చెప్పండి మీ అమ్మకి-వెధవ ముండ అయి ఉండి అన్నిటికి ముందుకు రాకూడదని' అంది. నాయనమ్మ ఏడుస్తూ లోపలికెళ్ళిపోయింది. ఆ రోజు బాబాయ్‌కాని, నువ్వుకాని పిన్నిని ఒక్కమాటైనా అన్నారా? ఈ నీతులన్నీ పిన్నికి ఎందుకు చెప్పలేదు?"

మా వాడి ప్రశ్నలకు నా గుండెలో రాయి పడిపోయింది. ఆ సంఘటన గుర్తొచ్చి మనసు చలించి పోయింది. మా నాన్న చనిపోయిన బాధ నుంచి, మా అమ్మ అప్పుడప్పుడే బయటపడుతోంది. మనుమరాలు పెళ్ళి ఆనందాన్ని మనసులో నింపుకొని తిరుగు తోంది. ఆ రోజు మా మరదలు అన్న మాటల ప్రభావంతో మా అమ్మ ముఖం ఎలా పాలిపోయిందో ఇప్పటికీ నా కళ్ళకు స్పష్టంగా కనిపిస్తోంది. మా తమ్ముడు పెళ్ళాన్ని ఎదిరించి మాట్లాడలేదు. నేను జోక్యం చేసుకుంటే అక్కడ 'సీను' మారిపోతుంది. భూకంపాలు, సునామీలు సృష్టించబడతాయి. అలకలు, ఏడుపులతో గందరగోళం అవుతుంది. పైగా బంధువర్గం అంతా ఉన్నారు. ఆ తరువాతయినా ఆ విషయాన్ని బయటకు తెచ్చి,' మా మరదలుకు బుద్ధి చెప్పాలనుకున్నాను. కాని మా ఆవిడ 'నీకెందుకు -నోరు మూసుకోమంది'- ఇలా ఉంటాయి గృహ రాజకీయాలు.

మా అబ్బాయి ఈ విషయాన్ని గుర్తు పెట్టుకొని సందర్భం చూసి నన్నడిగాడు. చిన్న పిల్లవాడు కాబట్టి ఆ ధైర్యం, ఆ చొరవ వాడిలో ఉన్నాయి. వీడు పెద్దవాడయ్యి, భార్య వచ్చిన తరువాత కూడా ఈ సద్గుణాలు, ధైర్య సాహసాలు వీడిలో ఇలాగే ఉండాలని మనసులోనే భావించాను.

"ఏంటి డాడీ! మాట్లాడరేంటి?" అంటూ మా వాడు నా చెయ్యి పట్టుకు విదిలించాడు.

అప్పుడు మళ్ళీ యీ లోకంలోకి వచ్చాను. మా వాడికి ఎలా చెప్పాలో అర్థంకాక- చివరకు యిలా అన్నాను-

"ఇలాంటి ఇబ్బందులు లేకుండా, అమాయకుల్ని హింసించకుండా ఉండటానికే నిన్ను అలాంటి పనికిమాలిన మాటలు, మూఢనమ్మకాల జోలికి పోవద్దని చెబుతున్నాను. వీటి నుంచి నువ్వు ఎంత దూరంగా ఉంటే అంత మంచిది. ఆ మధ్య 'తలమీద బల్లి పడితే మరణం అంట కదా!' అని అడిగావు. ఇలాంటి బల్లి శాస్త్రాలు, పిల్లి శాస్త్రాలు మనకొద్దు. ఇవి అన్నీ మనిషిని భయభ్రాంతంచేసి పిరికివాళ్ళను చేస్తాయి. వాడి ఆలోచనా పరిధిని పెరగనివ్వవు. మనిషిలో సంకుచిత మనస్తత్వం పెరిగి పోతుంది. జీవితంలో ఎదురయ్యే సమస్యల్ని ధైర్యంగా ఎదుర్కోలేక పిల్లుల్ని, బల్లుల్ని, అమాయకుల్ని తిట్టుకుంటూ 'శాడిస్ట్'గా మారిపోయే అవకాశం ఉంది. కుల, మతాలు మనుషుల్ని ఎలా ఒంటరివాళ్ళను చేస్తున్నాయో ఇవి కూడా అలాగే మనుషుల్ని కలవకుండా చేస్తాయి. ఆత్మవిశ్వాసాన్ని పోగొడతాయి. అందుకే వీటి జోలికి పోకు.

"నువ్వు తెలుసుకోవలసిన, సాధించవలసిన గొప్ప గొప్ప విషయాలు ఎన్నో ఉన్నాయి. మన చుట్టు ఉన్న సమాజాన్ని, మనుషుల్ని ముందు మనం ప్రేమించాలి. సమాజంలోని వ్యక్తులంతా ఏ స్పర్థలు, అపోహలు లేకుండా కలిసి జీవించాలి. 'వసుధైక కుటుంబం' అని మన పెద్దలన్నారే- అలాంటి 'ఒకే ప్రపంచాన్ని' మనం సాధించాలి.

"మనిషి అజ్ఞానంలోంచి, అవిశ్వాసంలోంచి పుట్టిన యిలాంటి అపశ్రుతుల్ని ఒదిలించుకోవాలి. అందరం కలిసి ఆరోగ్యంగా జీవించటం గురించి, చుట్టు ఉన్న ప్రకృతి గురించి, ఆకాశంలో ఉన్న నక్షత్రాల గురించి, సముద్రంలో ఉన్న సంపదల గురించి, సకాలంలో వర్షాలు పడటం గురించి, పంటలు బాగా పండించటం గురించి ఆలోచించాలి. సృష్టించిన సంపదల్ని ఏ ఒక్కడో, కొద్దిమందో కాజేయకుండా సమాజ నిర్మాణ సూత్రాలను చక్కదిద్దాలి.

"ఒరే బాబు! నువ్వు ముందు ముందు సమాజానికి ఎంతో ఉపయోగపడతావు. ఇప్పుడు బాగా చదువుకో. నువ్వు విద్యార్థి దశలో ఉన్నావు. విద్యార్థులే భావి భారత నిర్మాతలు. మీరే రేపటి మన భాగ్యవిధాతలు. అనవసరమైన 'అశాస్త్రీయ'మైన విషయాల్లోకి పోయి మనసులు పాడు చేసుకోవద్దు. మీ తెలివిని, విజ్ఞానాన్ని సమాజ అభివృద్ధికి ఉపయోగించండి. శాస్త్రీయమైన, నిర్మాణాత్మకమైన, ప్రేమ, ఆనందము తప్ప యింకే వికారాలు లేని గొప్ప సమాజాన్ని తీర్చిదిద్దండి" అన్నాను.

నాలో ఉద్రేకం పెరిగిపోతే నేను గంటలు గంటలు ఉపన్యాసాలిస్తానని మా వాడికి తెలుసు. అందుకే మధ్యలో నా చెయ్యి పట్టుకుని-

"అలాగే డాడీ! నువ్వు చెప్పినట్టే చేస్తా" అన్నాడు.

"సరే! ఈ రోజు పరీక్షలు అని బయలు దేరావు. ఇక్కడే కూర్చుండిపోయావు. మరి బయలుదేరు" అన్నాను.

"విశాలాక్షి ఆంటీతో చెప్పివస్తాను డాడీ!" అన్నాడు.

నేను చెప్పిన విషయాలు మా వాడు వెంటనే ఆచరణలో పెట్టినందుకు నాకు మహదానందం కలిగింది.

"వెరీ గుడ్! వెళ్ళిరా" అన్నాను జాలువారుతున్న ఆనంద భాష్పాలను తుడుచుకుంటూ!

*

# అమ్మ అద్వితీయ నిర్మాణ, రూపాల, సారం

# తొలెరుక (జన్మ కావ్యం)

- వర్ఝుల శివకుమార్

నానాటికీ లుప్తమైపోతున్న మానవీయ విలువల మధ్య అమ్మ అన్న భావనలో ఇమిడిఉన్న ఆత్మీయ స్పర్శను వ్యవస్థలు మరిచిపోతున్నాయి. అమ్మ జీవచైతన్య అడ మానవ నిర్మాణం కలుషితమౌతున్న సంస్కృతులక్రింద పురుషుని లైంగికావసర పరికరంగా, సౌందర్యానుభవ వాంఛల సాధనంగా మారిపోతుంది. మానవ శ్రమ అనుభవాలలోని ఉన్నతినీ, ప్రయోజనాన్ని విస్మరిస్తూ రాచరిక వ్యవస్థ స్త్రీని శృంగార విలాస వస్తువుగానూ, పెట్టుబడిదారీ వ్యవస్థ వ్యాపార సరుకుగానూ, సామ్రాజ్యవాద వ్యవస్థ క్రూర మనస్తత్వంగల పాత్రలుగా చిత్రిస్తూ అసహ్యాకరమైన విధానాలకు శ్రీకారం చుట్టాయి.

పుస్తక సమీక్ష

సామాజికంగా వేధింపు లకు, సాధింపు లకు అమ్మ రూపంలోని స్త్రీ మూర్తిని కేంద్రంగాచేసి పురుషస్వామ్య భూస్వామ్య జాలాలు నిరంతరం జులుం కొనసాగిస్తున్నాయి. అఖండసృష్టికి మూలమైన అమ్మ, ఒక స్త్రీ మూర్తిగా అనుభవిస్తున్న ప్రత్యక్ష, అప్రత్యక్ష హింసను చూసి కవిగా చలించి సుదూరకాలం వెనక నుండి ఆధునికయుగం వరకూ నైసర్గిక, స్వాభావిక పరివర్తనల్లోని ఆమె ధర్మా విష్కరణలను దర్శించి అమ్మ భావనతో ఆత్మానుశీలనంచేసి దర్శింపజేసిన విశిష్ట జన్మకావ్యం ఛాయరాజ్ దీర్ఘ కవిత తొలెరుక. అపురూపమూ అత్యంత శక్తివంతమూ అయిన ఆడజన్మలోని ఉన్నతత్వాన్నీ, త్యాగాన్నీ, వేదననూ శాస్త్రీయంగా విశ్లేషించి సమకాలీన సందర్భాలతో అన్వయించి, ఆద్యంతమూ అమ్మ ఆత్మావిష్కరణ లక్ష్యంగా తన రచనను కొనసాగించారు కవి.

వస్తువు విస్తృతినిబట్టి అనివార్యంగా పౌరాణిక ప్రస్తావనలనూ, ప్రాచుర్యంలోనున్న చారిత్రక ప్రాధాన్యాలనూ, స్థలవిశేషాలనూ సమ్మిళితం చేయవలసిరావడంవల్ల భాష, వాక్య నిర్మాణాలు కొంత కఠిన సదృశ్యంగా కనిపించినా, పఠనీయతకు ఆటంకం కాకుండా సమర్థవంతంగా రచనను కొనసాగించారు కావ్యకర్త.

ఈ దీర్ఘకవితా కావ్యాన్ని జన్మ కవిత అనడంలో ఔచిత్యాన్ని కవి తన ముందు మాటలో చక్కగా వివరించారు కవి. ఆరు ఖండాల ప్రపంచానికి తొలెరుకైన అమ్మ అద్వితీయ నిర్మాణ, రూప సారాలకు ఈ కావ్యం అద్దం పట్టింది. దీర్ఘ కవితా ధారను ప్రయోజనశీలంగా, ప్రవాహశీలంగా కొనసాగించే ఛాయరాజ్‌ని 'ఈ కావ్యం' వర్తమాన దీర్ఘకవితకు ఉద్యమ చిరునామాగా పరిచయం చేస్తుంది!

వస్తు లక్ష్యసిద్ధిక్రమంలో ఏకసూత్రతను, పరస్పరాశ్రిత భావశబలతను ధాతువులుగా తీసుకుని రచనను కొనసాగించారు ఛాయరాజ్.

అమ్మ తాదాత్మతను, తత్పరతను, తాపత్రయాన్ని, ఆంతరిక చైతన్యాన్ని తాత్విక భూమికను శక్తివంతంగా ఆవిష్కరించింది కవిత.

మొత్తం ఐదు ప్రకరణాలుగా సాగే ఈ దీర్ఘ కవితలో తొలి ప్రకరణం విశ్వపరివ్యాప్తమైన

అమ్మను దర్శింపజేస్తే, రెండవ ప్రకరణం గర్భస్థ పరిణామంలో గర్భాశయంలోని జైవిక చైతన్యంలో మాతృత్వం గొప్పదనాన్ని కళ్ళకు కడుతుంది. "ఉమ్మ జల గర్భంలోని విశ్వ ప్రేమ రహస్యాలను విశదం చేస్తుంది.

మూడవ ప్రకరణంలో అమ్మ ఆత్మ సంబంధ రూపాలైన తల్లీ, చెల్లీ, కూతురూ, కోడలూ మొదలైన రూపాల తత్పరతను ఎరుకపరిచి, భాషా పరిణామాన్ని వివరిస్తూ అందునా మాతృభాష ఔన్నత్యాన్ని అద్భుతంగా చెబుతుంది.

నాల్గవ ప్రకరణంలో సాపేక్షమైన అమ్మ అమృతత్వాన్ని తన చిన్నారి జన్మలో ఆపేక్షించుకుంటూ కృతజ్ఞతాపూర్వకంగానే తన అక్షరార్చనను కృతకృత్యం చేసుకుంటాడు కవి.

చిన్నారి ఎదుగుదలలో అమ్మ అపురూప హృదయావిష్కరణను, ఐదవ ప్రకరణంలో వివరిస్తూ అమ్మ శ్రమ రచన తాత్పర్యంలోంచి అయిలమ్మల్ని, అంకమ్మల్ని అగ్ని క్షిపణుల్లా పరిచయంచేస్తూ ముగిస్తాడు.

ఆద్యంతం ప్రతిభావంతంగా చక్కని లయతో కొనసాగించడం వల్ల క్రమంగా కావ్యపఠనంలోకి పాఠకుడు సంలీనమై పోతాడు.

జ్వలించి చల్లారి నదులుగా ప్రవహించిన భూమండలాన్ని సూర్యుడి తల్లిగా, కవితా స్వరూపిణిగా పరిచయం చేయడం బాగుంది. అలాగే ఋగ్వేదకాలంనాటి ఛందో రీతులను మాతృత్వ కవితా స్వరూపాలుగా చెప్పడం ఓ విశేషం. విశ్వ ధ్వని తరంగాల ప్రస్తావనలో

మానిషాద వాక్యరస ప్రవాహాలు
కురుక్షేత్ర కర్మ కర్త విషాదాలు
భాసకాళిదాసాది కవులనించి గురజాడ,
శ్రీశ్రీలదాకా విస్తరించిన

ఉగ్రాగ్నులుగా పరిచయం చేయడం వైవిధ్యంగా ఉంది.

పౌరాణిక సందర్భాన్ని ప్రస్తావించినా, చారిత్రక క్రమాన్ని ప్రతిపాదించినా అమ్మకు సంబంధించిన ఆత్మాంశతోనే అనుసంధిస్తూ సాగుతారు ఛాయరాజ్. కవిగా అనుభూతి ధారలో తడిసి తాను ఏ స్థితికి లోనౌతాడో పాఠకుడినీ అదే అనుభవంలో మమేకం చేస్తాడు ఛాయరాజ్ తన రచనలో.

ఓ చోట అమ్మని నీలి ఆకాశంలా, మరో చోట రుచీ రాగాల పాలముద్ద రచనగా, ఉయ్యాల లూగుతున్న కుటుంబ గడియారంలా వర్ణించడం చక్కని స్వభావోక్తి.

నాన్న చొరబాటుని రసరమ్యమైన పీడన అనడం పురుషాధిక్య ప్రపంచపు ద్వంద్వ స్వభావాన్ని స్పష్టపరుస్తుంది. (పేజి.9)

అమ్మను వర్ణించడం తనవల్ల కాదంటూ
నేను తొక్కుతున్న ఆరు భూఖండాల
మన్నును ధరించి
అడవులను ఊపి పర్వతాలను చిమ్మినా
అమ్మ నీ ధ్యాసను పూర్తిగా రచించలేను.

అంటాడు. (పేజి.10)

మరో చోట అమ్మ నీ పరీవాహక ప్రాంత ప్రభాతాన్ని కనికరించు. ఏడ్పించిన, నవ్వించిన నన్ను క్షమించు అని వేడుకుంటాడు కవి. ధ్వని వికాసంలో అమ్మని అన్వయిస్తూ నేలని పావనుచేసి పాలిచ్చి పెంచిన అమ్మ అస్తమయ సందర్భంలో (పేజి.18)

నా పొట్టనిండా పాలపుంత
నా కపాలంనిండా కావ్యచింత
ధ్వనినన్నెక్కుతున్నట్టుంది
ధార నన్ను దిగుతున్నట్టుంది అంటూ

గుర్తు చేసుకుంటారు ఛాయరాజ్.

జన్మనిచ్చి, జన్మను కృతకృత్యం చేసుకునే శక్తినిచ్చిన తల్లిని అభ్యర్థిస్తూ-

అమ్మా నీ రుణం తీర్చుకోలేను
నా కంఠాన మరోసారి ముద్దుపెట్టు అంతే
నా వయసుకు సున్నా చుట్టూ
నీయంత నేనెలాగూ కాలేను
నీ ఒడిలో నన్ను శిశువుగా మార్చు

అంటాడు.

సమస్త నాగరికతల ఆవిర్భావాలకు మూలకందమైన అమ్మని

తొలిసాగామె! ధాన్యాగారమాయె! పణ్యం
ఆమె! బహరేన్ రేవు.

మొసపోటేమియా పడవ అంటూ విశ్వవ్యాప్త వికాసాల జాడల్లో అమ్మను చూపిస్తారు ఛాయరాజ్.

అమ్మ విశాల విశ్వప్రేమను విశిష్టంగా పరిచయంచేస్తూ, విస్తృత సీతాభూమి ముద్ద, కన్నీట కన్యకుంతీ, కురుద్రౌపద యుద్ధ, కణవ గిరిజనాప్సర శకుంతల; రాచరిక వ్యవస్థను మట్టి బండెక్కించిన వసంత సేన, భూస్వామ్య లైంగిక నీతిని గేలి చేసిన మధురవాణి, చలం, మీనా, గోర్కీ, శివసాగర్ అమ్మలలాంటి ఎందరెందరో తల్లుల ఆత్మీయతలకు అద్దంపడుతూ ఆరాటాలకు, ఆవేదనలకు అక్షర లయల రూపాన్నిస్తూ అమ్మ అనంత భావనలోని మాధుర్యాన్ని, పవిత్రతను పునఃప్రతిష్టించే ఈ 'తొలెరుక' జన్మకావ్యం అమ్మను ప్రేమించాల్సిన ప్రతి ఒక్కరూ చదవదగిన గొప్ప కావ్యం.

♦♦♦

**తొలెరుక (జన్మకావ్యం)** రచన: ఛాయరాజ్, ఆంధ్రప్రదేశ్ టీచర్స్ ఫెడరేషన్ ప్రచురణ, పేజీలు:32, వెల: రు.15/-. ప్రతులకు: 'ఛాయరాజ్' పాత పోస్టాఫీసు వీధి, శ్రీకాకుళం మరియు మైత్రీ బుక్ హౌస్, కారల్‌మార్క్స్ రోడ్డు, విజయవాడ-2. ❖

---

**56 ఏళ్ళ క్రితం 1949 జూలై 14న ఎలమర్రులో కాంగ్రెస్ పోలీసుల దౌర్జన్యం [illegible]**

# ప్రాణహానికన్నా దుస్సహం మానహాని!

**- శ్రీశ్రీ, కొ.కు. తదితరుల ప్రకటన**

ఒకప్పుడు ప్రజాస్వామిక పరిపాలనలో భారతదేశం అంతటికీ తనదే అగ్రస్థానమని కీర్తిగడించిన మద్రాసు రాష్ట్రం ఈనాడు నిరక్షరకుక్షులైన పోలీసుభటుల చేతులలో కీలుబొమ్మగా మారిందేమో అని అనుమానించడానికి గట్టి నిదర్శనాలుగా కనిపించే నికృష్ట సంఘటనలు కొన్ని రాష్ట్రమంతటా సాగిపోతున్నట్లు పత్రికలలో వార్తలు వస్తున్నాయి; ప్రముఖులు ప్రకటనలు చేస్తున్నారు; ప్రజలు ఘోష పెడుతున్నారు. ఇటీవల కాటూరు, ఎలమర్రు గ్రామాలలో జరిగినట్టు ప్రకటించబడ్డ అత్యాచారాల వార్తలలో, అరవీసం అయినా నిజం వుంటే, పరువుగల ప్రభుత్వం యేదీ, తన ఉనికిని సమర్థించుకోలేదు. ఆ ప్రాంతాలలో జరిగాయన్న చర్యలను గర్హించడానికి "పాశవికం" అన్న మాట వాడితే, అది పశువులను అవమానించినట్లవుతుంది. మన పురాణాలలో చెప్పిన యమభటులు కూడా ఊహించలేని చిత్ర విచిత్ర హింసలను యీనాటి సర్కారు నౌకరుల సాగిస్తున్నారనడానికి, ఎలమర్రు దురంతాలను చిన్న ఉదాహరణగా చూపించవచ్చును. ప్రజలలో అసంతృప్తి ఒక ప్రబల జాడ్యంగా పరిణమించినప్పుడు, దానిని సవరించడానికి పోలీసుశాఖను ఉపయోగించడం, అంతిమ

ఘడియల్లో గరళం వాడటం వంటిది. కాని మన ప్రభుత్వం అనుదినం హాలాహలాన్ని ప్రయోగిస్తున్నట్లు కనిపిస్తోంది. సభ్యతపట్ల ఏ మాత్రమైనా గౌరవమున్నవారు యీ ప్రక్రియను హర్షించలేరు. రాజకీయ వర్గాల లోని చీలికలూ, పదవులకోసం చేసే జిత్తులూ, వాటి నెదుర్కోవడానికి వేసే ఎత్తులూ మొదలైనవాటితో, అమాయక ప్రజలను యిలా హింసించడం, పరిపాలన దక్షత దివాలాతీయడం అనిపించుకుంటుంది. లోగడ యిటువంటి సంఘటనలు జరిగితే, శ్రీ పట్టాభివంటి అగ్రనాయకులూ, కృష్ణా పత్రికవంటి సాంప్రదాయిక పత్రికలూ వాటిని తీవ్రంగా ఖండించాయి. నాడు ప్రతిఘటించిన దౌష్ట్యం నేడు రాగాన పడింది. ఇదేమీ బాగులేదు.

ప్రభుత్వం తమ తాబేదార్లను వెనక వేసుకొనివచ్చి ఎన్ని సంజాయిషీలు చెప్పినా, ఎంత తెల్లసున్నం కొట్టినా, ఎలమర్రు దారుణాలు జరగలేదని మేం నమ్మలేం. వందల కొద్దీ జనం ఒకే అబద్ధాన్ని ఆడలేరు. తెల్లవాడి హయాంలో సహా కని విని యెరుగని ఘాతుకాలు జరుపుతున్నది నేటి పోలీసుశాఖ. అవును; ప్రజామానలుంటాకులీ భటనృశంసులు. ప్రాణహానికన్నా దుస్సహం మానహాని. వీల్లేదు; అంధయుగాల్లో కూడా జరుగని యిటువంటి నైచ్యాలు. యీ శతాబ్దంలో జరగడానికి ఎంత మాత్రమూ వీల్లేదు. ఏ రాజకీయాలతోనూ జోక్యంలేని ఘరానా వ్యక్తులు కొందరు, క్షుణ్ణంగా యీ విషయాలన్నీ దర్యాప్తు జరిపి తీరాలి. అట్టి పెద్దమనుష్యులతో ఒక విచారణ సంఘాన్ని నియమించడం, పాలకుల కనీస ధర్మం. ఇది యెంత శీఘ్రంగా జరిగితే అంత మంచిదని, యీ దిగువ సంతకాలు చేసిన మేము ఏకగ్రీవంగా హెచ్చరిస్తున్నాం.

**- శ్రీరంగం శ్రీనివాసరావు; కొడవటిగంటి కుటుంబరావు, తాపీ ధర్మారావు, మల్లాది రామకృష్ణశాస్త్రి, గోపీచంద్, మాధవపెద్ది గోపాలకృష్ణ, "ఆరుద్ర", సెట్టి ఈశ్వరరావు.**

- విశాలాంధ్ర (పక్ష పత్రిక) 1949 ఆగస్టు 1

1948లో కలకత్తా కాంగ్రెసు తర్వాత కమ్యూనిస్టు పార్టీ సాయుధ పోరాట మార్గాన్ని అవలంబించింది. తెలంగాణా పోరాటం సాంఘిక విప్లవంగా పరిణమించింది. ఆ పరిస్థితిలో, సర్కారు జిల్లాల్లో కూడా కమ్యూనిస్టులను ఏరి పారేద్దామని, కమ్యూనిస్టు పార్టీని నిషేధించి, అజ్ఞాతంగా వున్న కమ్యూనిస్టులను హింసిస్తూ కాల్చివేస్తూ పోలీసు బలగంచేత కాంగ్రెసు ప్రభుత్వం నరక యాతనలను అమలు పెట్టించింది. 1949 జూలై 14న కృష్ణాజిల్లా ఎలమర్రు గ్రామంలో, అనుమానం కొద్దీ పురుషులందరినీ పట్టుకొని గుడ్డలు ఊడదీసి తమ స్త్రీ జనం ముందు గాంధీ విగ్రహం చుట్టూ తిప్పించడం జరిగింది. అవమానకరమైన ఈ అసభ్యఘటనను పురస్కరించుకొని వెలువడిందే ఈ ప్రకటన. "ఎలమర్రు, కాటూరు సంఘటనపై దర్యాప్తు జరగాలని మేధావుల హెచ్చరిక" అనేది ఈ ప్రకటనకు ఆ పత్రిక ఇచ్చిన ఉపశీర్షిక.

- శ్రీశ్రీ సాహిత్యం మూడు-వచన విభాగం-షష్టిపూర్తి సంఘ ప్రచురణ 1970 సౌజన్యంతో

*

కవిత

# ఈరోజు నేనుకంటున్న రేపటి నా కల!

- చిత్తలూరి సత్యనారాయణ

చుట్టూ నీళ్లే, స్వచ్ఛమైన కన్నీళ్లు
దుఃఖ సముద్రంలో ఏకాంతంగా రెండుకాళ్ల ఒంటరి ద్వీపం
తప్పిపోయిన ఆనవాళ్లకోసం రెండు కన్నీటి చుక్కలై
విచార సముద్రాన్ని ఉప్పొంగిస్తూ
మట్టి సముద్రం రెండుగా చీలిపోయి
నెర్రెలోయలోంచి చీమలబారుల్లా వలస కార్మికులు
దేశ రాదారులన్నీ వలసదారులే!
పచ్చని మొయిలులేదు, బాటంతా నెత్తుటి గాయాలే!
తప్పిపోయిన కుమారుడు వలసదారిలో
బతుకు గమ్యాన్ని ఛేదిస్తూ వెళ్లిపోయిన
అమ్మా నాన్నల్ని వెతుక్కుంటూ
బతుకు రాదారిలో కూలిన వంతెన
కూలి బతుకుల్ని వేరుచేసింది
జోడించిన చేతులను, ఏ చేయీ ఆత్మీయంగా తట్టదు
ఒంటరి పాదాలకు, ఏ ఒంటె పాదాలూ తోడురావు ఎడారిలో
అదృశ్య హస్తం నీడలో కురవని మేఘం
ఆకాశం దిగులుపోతోంది
నేల ముఖం ముడతల్లో కరువు చిట్లింత
ఎముకలు తేలిన ఒకప్పటి నదిలా, ఎడారిమీద యిసుక గీతలు
కరువూ, కాటకాలు ముసలి జోడెడ్లయి
రైతు బతుకు నాగలి మోరాయిస్తుంది
కోకలేయని నేలమీద, కొన ఊపిరితో పల్లెవిత్తనం
రాని బతుకుబండికోసం
కల్ల కాసారాలు యింకిపోయేదాకా ఎదురు చూపులు
యంత్రాల రెక్కలు కట్టుకున్న అంధ నాగరికతకు
మట్టి చేతుల రోదనలు వినిపించవు
బురద కాళ్ల పరిమళం కదిలించదు
అభయాలు లేకున్నా, ఎన్ని భయాలు బతుకును భయపెట్టినా,
ఈ దేశపు పియానో మెట్ల మీద
బురద కాళ్లే లయబద్ధంగా పరుగెత్తాలి

హరితగానం ప్రతి పల్లె గొంతునూ శృతిచేయాలి
పరాయీకరణ జడల భూతం మెడలు విరిగేలా
నిటారుగా నిలబడ్డ వెన్నెముకలు, కవాతు చేస్తూ సాగిపోవాలి
పదునుదేలిన నా దేశ పనిముట్లు
కొత్త గాయానికి కుట్లు వేయాలి
పలుగులూ, పారలూ,
సుత్తులూ, కొడవళ్ళూ,
పేదతట్టలూ, బువ్వగంపలూ
ఈ దేశ ముఖచిత్రం మీదచేసే
మూకుమ్మడి హరిత సంతకాలే
ఈరోజు నేనుకంటున్న రేపటికల!

**(జనసాహితి, అరసం మేడే నాడు విజయవాడలో నిర్వహించిన కవితా పఠనం కార్యక్రమములో చదివిన కవిత)** *



# ఇమ్రానాపై దుర్మార్గ ఫత్వా

ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని ముజఫరాబాద్ జిల్లాలో ఒక పల్లెటూరుకు చెందిన ఇమ్రానా అనే 28 సంవత్సరాల ముస్లిం మహిళపై స్వయంగా ఆమె పెనిమిటి తండ్రే జూన్ నెలారంభంలో అత్యాచారం చేశాడు. ఆమె ఐదుగురు పిల్లల తల్లి. తనకు జరిగిన అన్యాయాన్ని పోలీసులకు ఫిర్యాదు చేసింది. ఈ తరహా ఘోరనేరాన్ని చట్టబద్ధంగా విచారించి శిక్షించటానికి బదులుగా స్థానిక "దారుల్ ఉలూమ్ ఇస్లామిక్ సెమినరీ" అనే మత పెద్దలు, ఇమ్రాన్ ఇక నుండి తన భర్తతో కలిసి సంసారం చేయకూడదనీ, అత్యాచారం జరిపిన మామనే భర్తగా భావించి జీవితం సాగించాలనీ 'ఫత్వా' జారీ చేసింది. ఇదే షరీయత్ ధర్మమనీ ప్రకటించింది. ఈ ఫత్వాపై జోక్యం చేసుకోవటానికి "అఖిల భారత ముస్లిం పర్సనల్ లా" బోర్డు నిరాకరించింది. ఉత్తరప్రదేశ్ రాష్ట్ర మహిళా కమిషన్, ముఖ్యమంత్రి ములాయంసింగ్ యాదవ్‌కు లేఖ రాస్తూ ఇమ్రానాను తన భర్తతో ఉండేందుకు అనుమతించాల్సిందిగా కోరింది. ఇమ్రానాపై అత్యాచారానికి పాల్పడిన ఆమె మామను అరెస్టు చేయాలని, ఆయనకు బెయిల్ మంజూరు చేయకూడదనీ మహిళా సంఘాలు డిమాండు చేస్తున్నాయి. సి.పి.ఎం. పార్టీ ప్రధాన కార్యదర్శి ప్రకాశ్ కరత్ ఫత్వాను తీవ్రంగా ఖండించారు. సుప్రీంకోర్టు మాజీ న్యాయమూర్తి జస్టిస్ అహ్మదీ –"బాధితురాలు, ఆమె భర్త కలసి జీవించదలుచుకుంటే, వారి జీవితాల్లో జోక్యం చేసుకునే హక్కు మరొకరికి ఉండదనీ, ఫత్వా దురదృష్టకరం, హాస్యపూరితం" అని ప్రకటించారు.

మతాలు పుట్టకముందే మానవ నాగరికత మహిళలపై అత్యాచారాలను, బలవంతులు బలహీనులపై సాగించే దుర్మార్గంగా

పరిగణించింది. హిందూ వివాహ వ్యవస్థ, అత్యాచారానంతరం అదే వ్యక్తితో కాపురం చేయటాన్ని "పైశాచిక" వివాహంగా పేర్కొంది. ఇమ్రానాపై విధించిన ఫత్వాను గౌరవించినా, అమలుజరిపినా మహిళలపై అత్యాచారాలు జరిపి, వారిని బలవంతంగా పెండ్లి చేసుకునే తత్వాన్ని ప్రోత్సహించటమే అవుతుంది.

ఇమ్రానాపై అమానుషంగా అత్యాచారం జరిపిన ఆమె మామకు భారత రాజ్యాంగ చట్టం ప్రకారం సాధ్యమైన అతిపెద్ద శిక్ష విధించాలి. ఇమ్రానాకు, తన భర్త, పిల్లలతో సంసారం చేసుకునే చట్టబద్ధ హక్కుని అమలుజరిగేలా చూడాలి. పౌరసమాజం ఇమ్రానాకు అండదండలనందించి, నైతికంగా నిలబడేలా సహకరించాలి.

ఎన్నికలు, వోట్లు, సీట్లే సర్వస్వంగా భావించే రాజకీయ పార్టీలు, తాము ప్రమాణం చేసిన చట్టంలోని మానవ హక్కులకు కూడా కట్టుబడకుండా సమస్యను తమ అధికార పదవీ సాధన పరిధుల నుండే చూస్తున్నాయి. ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రి ములాయంసింగ్ యాదవ్, 'ఫత్వా' జారీ చేసిన ముస్లిం మతపెద్దలదే అంతిమ నిర్ణయమన్నాడు. కాంగ్రెసు నాయకుడు సల్మాన్ ఖుర్షీద్ "ఇది షరియత్ చట్టాలకు సంబంధించిన విషయమని, ఇందులో జోక్యం చేసుకోవటం సాధ్యంకాదని" అన్నాడు. ఇక భారతీయ జనతా పార్టీ నాయకులు ముస్లిం మత పెద్దల దుర్మార్గమంటేనే ముస్లిములందరి దుర్మార్గంగా వర్ణించి నల్లేరుపై బండిని తోలుతూ, హిందూమతం పేరిట మహిళలపై అమలు జరిగిన, జరుగుతున్న దుర్మార్గాలను విమర్శించటానికి జోక్యం చేసుకోవటానికీ ఎవరికీ వీలులేదనే భావజాలాన్ని వ్యాప్తి చేసే పనిలో అలుపెరగకుండా వున్నారు. షాబానో బేగం కేసులో రాజీవ్‌గాంధీ చేయించిన చట్టాన్ని, అప్రజాస్వామికాన్ని బాబ్రీ మసీదు కూల్చివేత ఉద్యమానికి వినియోగించుకున్నట్టు మళ్లీ తిప్పలు పడుతున్నారు. లౌకికవాదంపై దాడి చేయటానికి అప్పనంగా అందివచ్చిన అవకాశంగా ఆనందిస్తున్నారు.

హిందూత్వవాదుల దాడులకు మతం గూట్లోకి జారిపోయిన ముస్లిం మేధావులు, తమ మతంలోని ఛాందసత్వాన్ని విమర్శిస్తే ఇంకా బలహీనపడతామేమోనని సంశయిస్తున్నారు. మన శరీరంలో జేరిన రోగక్రిమికి చికిత్స చేసుకోకపోతే, శరీరం బలహీనపడుతుంది. చిరుగాలికి కూడా విలవిలలాడాల్సి వస్తుందని గ్రహించలేకున్నారు.

ఆధునిక యుగంలో లౌకికవాదం, ప్రజాస్వామిక సంస్కృతితో మేళవింపు జరగకపోతే తనకు తానుగా నిలువలేదనీ, బాహ్య మతోన్మాదాన్ని ఖండించటం, వ్యతిరేకించటమేకాక అంతరంగిక అప్రజాస్వామిక ఛాందసత్వాల చిక్కుముడులను, వ్యాధిగ్రస్త బలహీనతలను వదిలించు కోకుండా వ్యవస్థను ఆరోగ్యవంతమైన పునాదులపై నిలపలేమని గ్రహించాలి.

ఇమ్రానాకు జరిగిన ఘోరమైన అన్యాయాన్ని, అవమానాన్ని తొలగించటం మానవీయ హృదయం ఉన్న వారందరి పవిత్ర ధర్మం.

హైదరాబాదు — చెరుకూరి జ్యోతి

*

(5వ పేజీతరువాయి) మరణానికి కొద్దిరోజుల ముందు "గుజరాతు గాయం" చెరుపుకోలేని, గాంధీ హత్యతో సమానమైన నేరపూరిత చర్యగా అభివర్ణించాడు. నరేంద్రమోడీకి అంతర్జాతీయ నేరస్తుడిగా ముద్ర పడింది.

గత పార్లమెంటు ఎన్నికలలోనేకాక, తదనంతరం జరిగిన వాటిల్లో కూడా భాజపా ఓటమి పాలవుతూ వుంది. ఇటీవల జరిగిన 16 అసెంబ్లీ నియోజకవర్గాలు, రెండు పార్లమెంటు సీట్ల ఉప ఎన్నికలలో అది గెలిచింది ఒకే ఒక్కటి. కేవలం రెండు చోట్ల 25% మించిన ఓట్లను సంపాదించుకుంటే 7 అసెంబ్లీ2 పార్లమెంటు సీట్లలో దానికి లభించిన ఓట్లు 5% కంటె తక్కువ. ప్రపంచ దేశీయ మార్కెట్టుశక్తుల ఒత్తిడి, రాజకీయ అనివార్యతల ఫలితంగా- పరిస్థితులకు తలవొగ్గి పడగ దింపి ప్రయాణించాలని నిర్ణయించుకున్నందువల్లే, దానికి మీడియా ద్వారా విపరీత ప్రచారం కల్పించటానికి పాకిస్తాను పర్యటన సందర్భాన్ని అద్వానీ వినియోగించుకున్నాడు.

విశ్వహిందూ పరిషత్తు, శివసేనల్లాంటి సంస్థలు అద్వానీని హిందూ ద్రోహిగా చిత్రించాయి. పార్లమెంటుకు కూడా రాజీనామా చేయమని నిరసన ప్రదర్శనలు చేశారు. జిన్నా ఒక్కడే దేశ విభజనకు, నాటి విషాదాలకు కారణమన్నట్టు మళ్లీ చిత్రించారు. సంఘపరివారపు అధినాయకుడు సుదర్శన్- కొన్నినాళ్లక్రితం వాజపేయిని అత్యంత అసమర్థ ప్రధానిగా అభివర్ణించి-ఇపుడు రాజకీయ నాయకుల్నే వ్యభిచారిణులుగా ప్రకటించారు. జనసంఘం, భారతీయ జనతా పార్టీలను సృష్టించింది ఆరెస్సెస్సనన్న విషయం మరచి తమ సంతానాన్ని కూడా వ్యభిచారిణుల జాబితాలో చేర్చారు. అద్వానీ కోరిన "జిన్నాపై చర్చ"ను "ముగిసిపోయిన వ్యవహారంగా" తేల్చారు.' ఇందిరాగాంధీని శక్తివంతమైన ప్రధానిగా కీర్తించారు. ఆనాటి అమెరికా-రష్యా అగ్రరాజ్యాల 'పోటీ-కుమ్మక్కు'లలో భాగంగా దక్షిణాసియాలో వారికి జూనియర్ పెత్తందారుగా ఇందిరాగాంధీ ప్రభుత్వం వ్యవహరించిందనే కోణాన్ని సంఘపరివార్‌తో సహా పాలకవర్గ ముఠా రాజకీయ నాయకులందరూ కప్పి పెడుతున్నారు. రష్యాకు తల వొగ్గినా పాకిస్తానుని చీల్చటమే (రెండు ముక్కలు చేస్తే దేశ ద్రోహం! మూడు ముక్కలు చేస్తే కీర్తి సందోహం!) వీరోచిత చర్యగా కొలుస్తున్నారు. పాకిస్తానుతో యుద్ధంలో గెలిచి ఆజాదు కాశ్మీరుని కలిపేసుకోలేనందుకు వాజపేయి అసమర్థుడు! అంతేగాని బహుళజాతి కంపెనీలకు దేశాన్ని హారతి పళ్లెంలో పెట్టి సమర్పించి నందుకుగాదు. అమెరికావాడి దళారీలుగా, జూనియర్ పెత్తందార్లుగా వ్యవహరించినందుకుగాదు. దేశాన్ని ప్రైవేట్ లిమిటెడ్ కంపెనీగా మారుస్తున్నందుకు గాదు. ప్రజల జీవితాల్ని పెనం మీద నుండి పొయ్యిలోకి విసిరి వేపుకుంటున్నందుకూ కాదు. ఇది చాలదా సంఘపరివారపు దేశభక్తీ, సామ్రాజ్యవాద వ్యతిరేకతా బూటకమనీ, మతద్వేషతత్త్వంతో ప్రజలను చీల్చి పాలకులకు సేవ చేయుటమొక్కటే వాస్తవమనీ చాటడానికి! భారతీయ జనతా పార్టీ-ఆరెస్సెస్సుల నడుమ నడుస్తున్నట్టు కనబడే ఘర్షణ వాటిల్లోని ఆధిపత్యపు గ్రూపుల ఘర్షణ మాత్రమే. తెగేదాకా అది ఎప్పడూ పోదు. ఎందుకంటే అవి రెండు తలల శిఖండిలాంటివి! సరికొత్త కషాయంలో మతవిద్వేష తీవ్రత అడుక్కు పేరుకుని, కుహనా లౌకికపు తేట పైకి చేరుకుంటుంది. ఈ లోపలదంతా టీ కప్పలో తుపాను మాత్రమే! - 30.6.'05 ✱

కవిత

# నెత్తుటి బాకీ

- చెరుకు సుధాకర్

20 ఏళ్లక్రితం కారంచేడులో
దళితులపై దాడి జరిగిన సందర్భంగా
(17 జూలై 1985)

ఒకడు కారంచేడు
ఒకడు నీరుకొండ
ఎందుకమ్మా! మన రక్తం కాల్వలై పారిన
హంతక గుండెలపై పడీ పడీ ఏడుస్తావు
చేతులెత్తి అర్థిస్తావు
తోబుట్టో, తాళిబొట్టో, పేగు తెంచుకున్న
కడుపు తీపో
పోగొట్టుకున్నది ఏదైతేనేం!

చెల్లీ నా తల్లీ
వాణ్ణెవన్నీ న్యాయం కావాలని అభ్యర్థించకు
తుంగలో శవాల్ని తొక్కినవాళ్లు,
తుంగభద్రలో శవాల్ని విసిరేసిన వాళ్ళు
పిప్రా, బెల్చీ, భోజ్‌పూర్, చుండూరులో
ఎన్ని ముఖాలు తగిలించుకున్నా
ఎన్ని జెండా కర్రల్ని వెంటేసుకున్నా
ఒక్కరే తల్లీ!
శంబూకుడు, కోటేసు, ఆలీసమ్మ
మన తలల్ని అప్పుడప్పుడూ కోట గుమ్మాలకు
కట్టకపోతే రెచ్చిపోతామని
శ్రీరాముడి సాక్షిగా వాడు నమ్ముతాడమ్మా

వేట కొడవళ్ళ జడివాన ముగిశాక
మనవాడవాడంతా నెత్తుటి చిత్తడయ్యాక
ఆ మృగం ఎవడ్ని అభయహస్త మడిగిందో
తెలుసా అమ్మా
మృగానికి ఢోకాలేదని దాని గోళ్ళు తుడిచి
సాక్ష్యం మాయం చేసిన హంతక చక్రవర్తి
నీ కన్నీళ్ళు తుడుస్తూ అభయాభినయం
చేస్తున్నాడు
ఎక్స్‌గ్రేసియానోట్ల కట్టలతో వాడు నీ
నిలువెత్తు కొడుకుని తుంచి
అనుబంధాల్ని కొలిచి చేతులు
దులుపుకుంటాడు వాడు
నీతోపాటే వలవలా ఏడ్చి
టీ.వీ.లో, పేపర్లో ఫోటో అయి
రేపటి ఓటుకోసం అర్రులు చాస్తుంటాడు
వాడు ఓట్లకోసం తల్లిరొమ్ము చీల్చే రాక్షసుడు
ఒకింత మన రక్తం తొలకని
సూది మొనంత నేల చూపెట్టమ్మా
ఈ గుండె కోత మనకు మొదటిదీ కాదు,
చివరిదీ కాదు
తరతరాలు మనం పోగొట్టుకున్న
నెత్తుటి శ్వాసల్ని గుండెనిండా పీల్చుకో
పిడికిలి బిగించి నేలను ముద్దాడిన
వీరుల్ని తలుచుకో
జాలి జాలి అభ్యర్థనలు కాదింకా
నల్లని నిరసన జండాల నెగరేయ్
గోడు గోడు ఏడ్పులు కాదింకా
తిరుగుబాటు వడగాల్పుల్ని ఎగదొయ్
అట్టుడికిన నీ శరీరమంతా
అమ్ముల పొది కావాలి
నాగేటి చాళ్ళల్లో ఒలికిన నెత్తుటి బొట్లన్నీ
బిగి పిడికిళ్ళై మొలవాలి

- పిడికిలెత్తిన చుండూరు- దళిత పోరాట
పాటలు జనసాహితి -అరుణోదయ
ప్రచురణ (1991 అక్టోబరు) సౌజన్యంతో

# చైతన్యవాహిని

**15.6.2005**న శ్రీశ్రీ 22వ వర్ధంతి సందర్భంగా విజయవాడ కవిమిత్రులు, స్వాతంత్ర్య సమరయోధుల సంఘ భవన ఆవరణలో నిర్వహించిన శ్రీశ్రీ కవితా పఠనం, స్వీయ కవితా పఠనం కార్యక్రమాన్ని జనసాహితి ప్రధాన కార్యదర్శి కొత్తపల్లి రవిబాబు నిర్వహించారు.

సమావేశ ప్రారంభంలో జనసాహితి రాష్ట్ర కార్యవర్గ సభ్యుడు దివికుమార్ తన ప్రసంగంలో శ్రీశ్రీ సాహిత్య పరిణామాన్ని కవిత ద్వారా చెప్పాడు. "వెయ్యేళ్ల వెనక చూపు విస్సన్నల నొదిలిపెట్టి, కృష్ణపక్ష భావవాద దివి నుండి భువికొచ్చి అడుగుజాడ గురజాడగ, జనవిప్లవ ధ్యేయంగా ఉరికంబాలకు ఊపిరులూదిన వాడిగా శ్రీశ్రీ"కి జోహార్లు పలికారు.

ఆ తరువాత రవిబాబు మాట్లాడుతూ, శ్రీశ్రీ ప్రాసంగికత ఇంకా కొనసాగుతోందన్నారు. శ్రీశ్రీని చదివి తాము కవిత్వం పట్ల ఆకర్షితులయ్యామని కొందరూ, ప్రగతివాదంపట్ల ఆకర్షితులమయ్యామని మరికొందరూ, మార్క్సిజం గురించి నేర్చుకున్నామని ఇంకొందరూ చెప్పే వాతావరణం వుంది. అలా ఒక కవి రాసిన కవిత్వంతో ప్రభావితమయ్యే ఒక తరమైన వుంటే ఆ కవిని మహాకవి అనవచ్చు. అలా శ్రీశ్రీ మహాకవి. అంతేగాక, ఒక రచయిత మాటలో, వాక్యాలో ఒక జాతి భాషలో కలిసిపోయి అవి సామెతలుగానో, పద బంధాలగానో ప్రజలు వాడుతుంటే, ఆ రచయితను మహారచయిత అనవచ్చు. షేక్స్పియర్ అంతటివాడు. గురజాడ అంతటివాడు. శ్రీశ్రీ అంతటివాడు అన్నారు.

ఆ తరువాత జరిగిన కవితా పఠనం కార్యక్రమంలో అశోక్‌కుమార్ తను రాసిన ఈ క్రింది మినీ కవితలు చదివారు.

ఎందరో పుడతారు
అందరూ చస్తారు
కొందరే బతుకుతారు;
మహాకవి శ్రీశ్రీని
మర్చిపోవడం
తెలుగు కవిగా
చచ్చిపోవడం
శ్రీశ్రీ కూతురు మహాప్రస్థానం
నా తల్లి! నను గన్న తల్లి!
కవిగా నాకు జన్మనిచ్చిన తల్లి
అందుకే నేను
శ్రీశ్రీ మనవణ్ణి, శ్రీశ్రీకి వారసుణ్ణి!"

సి.హరిబాబు స్వీయ కవిత చదివారు. అరసవల్లి కృష్ణ శ్రీశ్రీ కవిత 'నెహ్రూ జ్ఞాపకాలు' చదివారు., పెద్ది కృష్ణ స్వీయ కవిత చదివారు. పి.హనుమాన్ ప్రసాద్, పాడవోయి భారతీయుడా పాట పాడారు. దివికుమార్ ఖడ్గసృష్టి కవిత, రష్యా, ఓ రష్యా, జగన్నాథ రథచక్రాల్ కవితలు, తన స్వీయ కవిత చదివారు. సుధ, ఓ మహాత్మా! ఓ మహర్షీ అనే శ్రీశ్రీ కవితను గానం చేశారు. నాగరాజు మరో ప్రపంచం, ప్రతిజ్ఞ చదివారు. విద్యార్థి దశలో ఆ కవితలు తమని ఎలా ప్రభావితం చేశాయో చెప్పారు. డా॥ చల్లపల్లి విజయ 'యలమర్రూ–కాటూరు' పై శ్రీశ్రీ రాసిన గేయం చదివారు.

శ్రీశ్రీ ముఖచిత్రంతో ప్రచురించిన 'చినుకు' సాహిత్య మాసపత్రికను, దాని సంపాదకుడు నండూరి రాజగోపాల్ పరిచయం చేశారు. రచయితల స్వేచ్ఛను హరిస్తూ, విప్లవ రచయితలను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఔరంగాబాదులో అరెస్టుచేసి, కుట్ర కేసులను బనాయించడాన్ని ఖండిస్తూ ఈ సభ తీర్మానం చేసింది. కవిమిత్రుల తరఫున నాగరాజు వందన సమర్పణ చేశారు. *

# జనసాహితి రాష్ట్ర కార్యవర్గం తీర్మానాలు
# 18, 19 జూన్, 2005

## 1. కొత్త ప్రభుత్వపు సంవత్సరకాలం

భారతీయ జనతాపార్టీ నాయకత్వాన గల ఎన్డీయే ప్రభుత్వం ఎన్నికలలో ఓటమి పాలై కాంగ్రెసు నాయకత్వాన ఐక్యప్రగతిశీల కూటమి (ఉప-యుపిఎ యునైటెడ్ ప్రోగ్రెసివ్ ఎలయన్స్) ప్రభుత్వం కేంద్రంలోనూ, చంద్రబాబు తెలుగుదేశం ఓడిపోయి కాంగ్రెసు మంత్రివర్గం రాష్ట్రంలోనూ అధికారంలోకొచ్చి సంవత్సరమయింది. ప్రజలు పెట్టుకున్న ఆశలకు వారికి లభించిన ప్రత్యామ్నాయానికీ పొంతన కుదరలేదని ఈ సంవత్సరకాలం రుజువు పరిచింది. దేశాన్ని పట్టి పీడిస్తున్న వ్యవసాయ, పారిశ్రామిక సంక్షోభానికి ఈ సంవత్సర కాలంలో ప్రజానుకూలమైన జవాబు లభించకపోగా పాత విధానాలు, పద్ధతుల కొనసాగింపుగానే వున్నది. ప్రపంచీకరణ విధానాల అమలు, బహుళజాతి కంపెనీలకు, ప్రపంచబ్యాంకుకు తల ఒగ్గి పాలించటంలో ఒక్క మాటలో దళారీతనంలో ఎన్డీయే పాలకులకు, 'ఉప' పాలకులకు నడుమ మాటల్లో తప్ప చేతల్లో తేడా ఏమీలేదని స్పష్టమైంది. ఈ ఆర్థిక, రాజకీయ లొంగుబాటు విధానాలే దేశ ప్రజల సామాజిక జీవనాన్ని తీవ్రంగా ప్రభావితం గావించి సాంస్కృతిక విలువల క్షీణతకు దారితీస్తున్నది. అభివృద్ధి చెందిన సామ్రాజ్యవాద దేశాల ముందు చేతులు కట్టుకొని నిలబడే బానిసతత్వం, జాతీయ వ్యక్తిత్వాన్ని నిజమైన అర్థంలో ప్రదర్శించలేని ఆత్మన్యూనతా యధావిధిగా కొనసాగుతున్నాయి. సినిమాలు, టీ.వీ., పత్రికలు మొదలైన ప్రధాన వ్యాపార మీడియా అంతా క్షీణ సాంస్కృతిక విలువలను వ్యాప్తిగావించటం పెచ్చరిల్లుతూనే వుంది. సామాజిక సంక్షోభానికి "దేవుడే దిక్కు" అనే పరిష్కారంవైపు ప్రజలను నెట్టటంలోనూ, అంధవిశ్వాసాల వ్యాప్తిలోనూ దొందూ దొందుగానే వున్నాయి.

లౌకిక విలువలను త్రోసిరాజనటం, బలహీనపరచటం బిజెపి, సంఘపరివారీయుల గుత్తసొత్తు కాదు. కాంగ్రెసు, తదితర పాలక రాజకీయపక్షాలన్నీ ప్రధానంగా కుహనా లౌకికవాదాన్ని పాటిస్తూ, ప్రజల మధ్య వైరుధ్యాలను పెంపొందించే సంక్షుభిత వ్యవస్థను కాపాడి కొనసాగించటమనే విధానాలు మతతత్వ శక్తుల పెరుగుదలకు భూమికను సృష్టిస్తాయి. ఆ విధంగా కుహనా లౌకికవాదం మతతత్వానికి ప్రత్యామ్నాయం కాలేదు.

ఘోరఫాసిస్టు దురంతాలకు పాల్పడిన గుజరాత్ సంఘటనపై, దానికి కారణమైన రాష్ట్ర ప్రభుత్వంపై రాజకీయమైన చర్య తీసుకోలేకపోవటం కాంగ్రెసు పాలకులతత్వానికే ఉదాహరణ. పోటా చట్టం పేరుతో అమాయకులను ముఖ్యంగా ముస్లిములను భౌతిక, మానసిక హింసలకు గురిచేసిన విధానకర్తలపై చర్యలేమీ లేవు. మతతత్వ వ్యాప్తిలో విద్వేషాలను, కలహాలను సృష్టించిన దుర్ఘటనలపై చట్టబద్ధమైన, విచారణలో చర్యలూ లేవు. ఆనాటి ప్రభుత్వ యంత్రాంగం ముఖ్యంగా పోలీసుల 'పక్షపాత'తత్వాన్ని బహిర్గతం గావించిందీలేదు.

భూస్వామ్య-సామ్రాజ్యవాద క్షీణ సాంస్కృతిక విలువలను వ్యాప్తి గావించటంలో రాజ్యం యొక్క పాత్రలో, గత సంవత్సరంలో వచ్చిన మార్పేమీ లేదు. లౌకిక -ప్రజాస్వామిక- దేశభక్తియుత సంస్కృతి కొరకు రచయితలు-కళాకారులు-మేధావులు భావజాల రంగంలో సాగించాల్సిన ప్రత్యామ్నాయ ఉద్యమ, నిర్మాణ కృషి ఆవశ్యకతను గుర్తించవలసిందిగా మనవి చేస్తున్నాము.

'మానవ ముఖం' పేరుతో ప్రజలను మోసంచేసే క్రూర, క్షీణ కళలను అర్థం చేసుకుని నూతన ప్రజాస్వామిక ఐక్య సాంస్కృతికోద్యమ నిర్మాణానికి చేతులు కలపవలసిందిగా జనసాహితి రచయితలకు విజ్ఞప్తి చేస్తోంది.

## 2. విరసం నాయకుల అరెస్టును ఖండిస్తూ...

మావోయిస్టు పార్టీ నాయకులతో సమావేశమై వున్నారన్న సాకుతో విప్లవ రచయితల సంఘం నాయకులను నలుగురిని రాష్ట్ర పోలీసులు అరెస్టు చేసి కుట్రకేసు పెట్టటాన్ని జనసాహితి తీవ్రంగా ఖండిస్తోంది. ఈ చర్యను పౌరస్వేచ్ఛను ముఖ్యంగా రచయితల యొక్క భావ, సంచార, సమావేశ స్వేచ్ఛను నిరాకరించే దమనకాండలో భాగంగా జనసాహితి పరిగణిస్తోంది. రచయితలూ, జర్నలిస్టులనే గౌరవాన్ని కూడా పాటించకుండా, వయస్సునీ, అనారోగ్యాలనీ పరిగణనలోకి తీసుకోకుండా చట్టవిరుద్ధంగా చట్టబద్ధంగా కూడా హింసించే విధానాలకు పాల్పడ్డ పోలీసు యంత్రాంగపు శాడిస్టుతత్వాన్ని ఖండిస్తున్నాం. తక్షణమే 'విరసం' నాయకులపై మోపిన కుట్ర కేసులను రద్దు చేయవలసిందిగా డిమాండు చేస్తున్నాము. మీ చట్టాలను గౌరవించే 'నిబద్ధత'ను మీ పోలీసు యంత్రాంగానికి అలవరచవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతున్నాం.

## 3. ప్రజల భాషలో విద్య-పరిపాలన అమలుపరచాలి

ప్రజలకు అర్థంకాని భాషలో పరిపాలన సాగించటం అప్రజాస్వామికం. రాచరిక యుగంలోనూ, వలస పాలనా కాలంలోనూ అలా సాగాయి అంటే అవి భూస్వామ్య-సామ్రాజ్యవాద సంస్కృతీ విలక్షణత కనుక అలా జరిగింది. నేటికీ అదే విధమైన పరిస్థితి ఇంకా కొనసాగుతోందీ అంటే నిజమైన అర్థంలో ప్రజాస్వామ్యం మనకు ఏర్పడలేదనటానికి ఇదొక ఉదాహరణ మాత్రమే. అలాగే సాధారణ ప్రజానీకపు నిత్యజీవితావసరమైన మాతృభాషలోనే విద్యను పొందటం ప్రాథమిక హక్కులలో వొకటి. మానవుల ఊహకు, కల్పనకు, విస్పష్ట భావ వ్యక్తీకరణకు సృజనాత్మకతకు, మాతృభాషే జీవాధారం. కంటి చూపుని పోగొట్టుకుని కళ్లజోళ్లకోసం తాపత్రయపడ్డట్టు, మాతృభాషను నిర్లక్ష్యం గావించి ఇంగ్లీషు వ్యామోహాన్ని రుద్దుతున్నారు. ఇది రెంటికి చెడ్డ రేవడలను మాత్రమే ఉత్పత్తిచేసి జాతిని నిర్వీర్యపరుస్తోంది. విద్య-ప్రభుత్వాల విధానాల్లో భాగంగా వున్నది. పాలకులే ప్రపంచీకరణ విధానాలకు తల వొగ్గి సామ్రాజ్యవాదుల ప్రయోజనాలలో భాగంగా ఇంగ్లీషు వ్యాప్తిని కృత్రిమంగా, దౌర్జన్యంగా ప్రోత్సహిస్తున్నారు. సాంస్కృతిక వ్యక్తిత్వాన్ని కోల్పోయే జాతి, తన వికాసాన్ని కూడా బలిచేసుకుంటుంది. మాతృభాషా మాధ్యమంగా అన్ని స్థాయిల్లో విద్య నేర్పాలని జనసాహితి తీర్మానిస్తూ, మాతృభాషోద్యమ కృషిలో పాల్గొనే వివిధ సంస్థలతో ఐక్యకార్యాచరణ కొనసాగించాలని నిర్ణయించింది.

## 4. ఇంగ్లీషు ప్రాథమిక పాఠశాలల ఏర్పాటు-ఖండన

రాష్ట్ర ప్రభుత్వం ఏర్పాటు చేసిన అధికార భాషా సంఘం కనీసం 10వ తరగతి వరకు మాతృభాషామాధ్యమంలో చదువు నేర్పాలని ప్రభుత్వానికి నివేదించింది. మాతృభాషోద్యమ సమాఖ్యవారు సమస్త ప్రాథమిక పాఠశాలల్లోనూ మాతృభాషలోనే (5వ తరగతి వరకు) విద్యగరపాలని డిమాండు చేస్తున్నారు. ప్రైవేటు విద్యా సంస్థలలో కూడా మాతృభాషా మాధ్యమంగా విద్యాబోధన సాగాలని మేధోవర్గాలు, ఉద్యమకారులు కోరుతూ వుండగా,

దాన్ని పాటించకపోగా ప్రభుత్వ ప్రాథమిక పాఠశాలల్లో కూడా (జిల్లాకు రెండు) ఇంగ్లీషు మాధ్యమంలో బోధన జరిపే ప్రయోగం చేయాలని రాష్ట్ర విద్యాశాఖ నిర్ణయించటం నిర్లక్ష్యపూరితమైన ప్రజావ్యతిరేక చర్య. విద్యార్థుల జ్ఞాన వికాసాన్ని కుదించివేస్తున్న ఇంగ్లీషు మాధ్యమ పాఠశాలలను అదుపు చెయ్యాల్సిన ప్రభుత్వం వాటికి ప్రోత్సాహమిచ్చే విధంగా స్వయంగా ప్రాథమిక పాఠశాలల్లో ఇంగ్లీషు మాధ్యమంలో చదువు నేర్పాలని నిర్ణయించటాన్ని జనసాహితి ఖండిస్తోంది. తెలుగు జాతీయ సంస్కృతీ సౌరభాల్ని గ్రహించలేని తరాలు జాతి వికాసాన్ని నిర్లక్ష్య పరుస్తారనే ఆందోళనతో ఇంగ్లీషు మాధ్యమంలో బోధనకు బదులు మాతృభాషల్లో (తెలుగు, ఉర్దూలలో)నే నేర్పాలని రాష్ట్ర ప్రభుత్వాన్ని డిమాండ్ చేస్తోంది.

## 5. అక్రమ లాభాల మీడియాకు క్రమశిక్షణట!

లాభాలే లక్ష్యంగా, ధనార్జనే ధ్యేయంగా దోపిడీ వ్యవస్థ పరిరక్షణే బాధ్యతగా నడుస్తున్న మీడియా పెట్టుబడిదార్లు స్వయం క్రమశిక్షణను అలవరచుకోవాలని తమకు తామే చెప్పుకుని కేంద్ర పరిపాలకులచేత ఆమోదముద్ర వేయించుకున్నారు. సినిమాలు, టెలివిజన్ ఛానెల్స్, దిన, వార పత్రికలు ఉత్తమ విలువలకోసం పోటీ కాకుండా క్షీణ, చౌకబారు ఆకర్షణల వ్యాప్తిలో పోటీలు పడి అత్యంత బాధ్యతారహితంగా ప్రవర్తిస్తూ, ప్రజలలో నీచాభిరుచుల్నీ, మూఢవిశ్వాసాలను, పతన విలువలను వ్యాప్తిగావించటానికి ప్రేరణ కల్పిస్తున్నారు. సాంస్కృతిక సామ్రాజ్యవాదపు పతన ధోరణులకు పట్టం గడుతున్నారు. ఇందుకు కొన్ని పత్రికలు ఒకటీ అరా సినిమాలు, అప్పుడప్పుడు వెలువడే టీ.వీ. కార్యక్రమాలు-మినహాయింపు మాత్రమే. బహుళజాతి కంపెనీల వ్యాపార ప్రకటనలపై ఆధారపడ్డ టెలివిజన్, జూద వ్యాపారంగా మారిన సినిమా నిర్మాణం, పాలక గ్రూపుల రాజకీయ ముఠా తగాదాల తోకలుగా మారిన దిన పత్రికలు ప్రజల యొక్క వాస్తవ జీవిత చిత్రణకు, ఆకాంక్షలకు అద్దం పట్టలేవు. విదేశీ టెలివిజన్ ఛానెల్స్ నీచాభిరుచులను పెంచే నగ్న, అర్ధనగ్న దృశ్యాలను, హింసాద్వేషతత్వాలను రెచ్చగొట్టే ప్రసారాలను నిస్సిగ్గుగా వరదలెత్తిస్తున్నాయి. ముద్రణా మాధ్యమం (ప్రింట్ మీడియా)లో విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులకు ప్రభుత్వాలు గేట్లు తెరుస్తున్నాయి. ఇవి జాతీయ భాషా పత్రికలను కబళించే ప్రమాదం పొంచి వుంది. పరిపాలకుల, మీడియా దొరల నడుమ కుదిరిన అవగాహన, దోపిడీ వ్యాపారస్వేచ్ఛనే భావవ్యక్తీకరణ స్వేచ్ఛగా దిగజారుస్తోంది. మీడియా 'స్వయం క్రమశిక్షణ'లోని ప్రజా వ్యతిరేక లక్షణాన్ని, వ్యాపార, లాభార్జనా ధ్యేయ పోటీతత్వాన్నీ, పాలకుల పరిరక్షణా గుణాన్ని విస్తృతంగా బహిర్గతపరచవలసిందిగా ప్రజల పక్షాన నిలిచే 'ప్రసార' జీవులకు జనసాహితి విజ్ఞప్తి చేస్తోంది. *

# స్వీకారం

**మట్టిగంప** (కవిత్వం) రచన: పరిమళ్, 1/8 డెమ్మీ, 86 పుటలు, వెల: రూ.30/-. పాలమూరు ప్రచురణలు-1 జనవరి, 2005. మొదటి ముద్రణ, ప్రతులకు: పరిమళ్, 4-164, మంగనూరు, బిజినపల్లి మండలం, మహబూబ్‌నగర్‌జిల్లా. దూరవాణి: 08540-223555 మరియు దిశ, నవోదయ, సహచర, తెలుగు బుక్ హౌస్, ప్రజాశక్తి, విశాలాంధ్ర.

రెక్కలు చాచిన పంజరం -ఫ్రెంచి నవల, పాపియాన్‌కి తెలుగు అనువాదం: రెండవ భాగం. అనువాదకుడు: డా॥ ఎం.వి.రమణారెడ్డి, 1/8 డెమ్మీ, 274 పుటలు, వెల: రూ.100/-. ప్రతులకు: విశాలాంధ్ర లేదా ఎం.వి.రమణారెడ్డి, ఖాదరాబాదు పోస్టు, ప్రొద్దుటూరు-516 362. దూరవాణి: 08564-251133.

**ఒక పొట్టివాడూ కొంధరు పొడవువాళ్ల కథ** (కథా సంపుటి) అట్టాడ అప్పలనాయుడు, ప్రచురణ: జనసాహితి, ప్రథమ ముద్రణ: మార్చి, 2005, 96 పుటలు, వెల: రూ.30/-. ప్రతులకు: మైత్రీ బుక్ హౌస్, విజయవాడ.

**అమ్మలపాది** (కవితా సంపుటి) చింతా లక్ష్మీసుజాత, ప్రచురణ: మనీష సంస్థ, విజయవాడ. ప్రథమ ముద్రణ: అక్టోబరు, 2004, 72 పుటలు, వెల: రూ.25/-. ప్రతులకు: రచయిత్రి, యఫ్.యఫ్.-2, శ్రీసాయికృష్ణ రెసిడెన్సీ, తాళ్ల రోషయ్యవీధి, కామయ్యతోట, విజయవాడ-520 007. ఇతర పుస్తక విక్రేతలు.

**కులగీత** (వచనకావ్యం) రచన: నాగమ్మపూలే, 1/8 డెమ్మీ, 170 పుటలు, వెల: రు.50/-. మహాత్మా జ్యోతిరావుపూలే మెమోరియల్ ట్రస్టు, కర్నూలు వారి ప్రచురణ: మొదటి ముద్రణ: 2005. ప్రతులకు: 50/753-55 యు/పి టాగోర్‌నగర్, కర్నూలు-518 002. లేదా సామాజిక తాత్విక విశ్వవిద్యాలయం, 2-2-186/53/5, రామకృష్ణ నగర్, బాగ్‌అంబర్‌పేట, హైదరాబాదు-500 013. దూరవాణి: 040-55164929. సంచారవాణి: 093910 36987.

**మరోసారి మరణిస్తున్న ఎన్టీఆర్** -రచన: త్రిపురనేని మహారథి, 1/8 డెమ్మీ, 80 పుటలు, వెల: రు.30/-, జయంతి పబ్లికేషన్స్, హైదరాబాదు వారి ప్రచురణ. నాల్గవ ముద్రణ: 2 ఏప్రిల్ 2005. జయంతి పబ్లికేషన్స్, అనంతపురం, హైదరాబాద్. ప్రథమ ముద్రణ: 18 జనవరి, 2005.

**ఎన్టీఆర్ పునరుత్థానం**: రచన: త్రిపురనేని మహారథి, 1/8 డెమ్మీ, 188 పుటలు. వెల: రూ.40/-. పై రెండు పుస్తకాల ప్రతులకు: విశాలాంధ్ర, నవోదయ మొదలగు అన్ని పుస్తకాల అంగళ్ళలో దొరకవచ్చు.

**కళంకిత సావర్కార్-బిజెపి, సంఘ్‌పరివార్** - రచన: డా॥ ఎ.బి.కె.ప్రసాద్, 1/8 డెమ్మీ, 40 పుటలు, వెల: 12/-. ప్రజాపంథా ప్రచురణలు-2004 డిసెంబరు.

**కాన్‌కున్, జెనీవా కపట నాటకాలు** -రచన: వేములపల్లి వెంకట్రామయ్య, 20 పుటలు, వెల: రూ.8/-. ప్రజాపంథా ప్రచురణలు: 2004 డిసెంబరు. పై రెండు పుస్తకాలు, ప్రతులకు: ప్రజాపంథా, మార్క్స్ భవన్, 658 విద్యానగర్, 7వ లైను, హైదరాబాదు:500 044 మరియు నవోదయ, సహచర, దిశ, హైద్రాబాదు: మైత్రీ, విజయవాడ.

**కన్నీళ్ళు సాక్ష్యం** (కవితా సంపుటి) గవిడి శ్రీనివాస్, ప్రచురణ:యువస్పందన, విజయనగరం. ప్రథమ ముద్రణ: జనవరి, 2005, 60 పుటలు, వెల: రూ.30/-. ప్రతులకు: గవిడి అనూరాధ, కేరాఫ్ గవిడి సూర్యనారాయణ, గతడ, మర్రివలస, సన్నాఫ్ రాజాం విజయనగరంజిల్లా-532 127, దూరవాణి: 08965-287517, సంచారవాణి: 94407 31266.

**అస్తిత్వానికి అటూ యిటూ..**(కథా సంపుటి) -మధురాంతకం నరేంద్ర, 184 పుటలు, వెల: రూ.75/-. ప్రథమ ముద్రణ: జనవరి, 2005. గ్రంథాలయ ప్రతి: రూ.125/-. ప్రచురణ మరియు ప్రతులకు: మహేంద్రా పబ్లికేషన్స్, 15-59/1, శ్రీపద్మావతినగర్, తిరుపతి-517 502.

**దాఖలా** (కవితా సంపుటి), వఝల శివకుమార్, 1/8 డెమ్మీ, 104 పుటలు, వెల: రు.50/-. పొయట్రీ ఫోరమ్, హైదరాబాదు వారి ప్రచురణ సంఖ్య:9, ప్రతులకు: విశాలాంధ్ర, ప్రజాశక్తి, నవోదయ, దిశ.

**వర్గీకరణీయం** (దళిత దీర్ఘకావ్యం) ఎండ్లూరి సుధాకర్, 1/8 డెమ్మీ, 50 పుటలు, వెల: రు.20/-. రెండవ ముద్రణ: గుడ్‌ఫ్రైడే మార్చి, 2005. ప్రతులకు: అన్ని ప్రముఖ పుస్తక విక్రేతల అంగళ్ళలో.

**వర్ధని** (నవల) రచన: చంద్రలత, 'చతుర'లో మే 1996లో ప్రచురింపబడింది. ఇప్పుడు పుస్తక రూపంలో డిసెంబరు, 2004లో వెలువడింది. ప్రభవ ప్రచురణలు-సంఖ్య 2, 1/8 డెమ్మీ, 128 పుటలు, వెల: రూ.60/-.

**ఇదం శరీరం** (కథలు) రచన: చంద్రలత, వివిధ పత్రికలలో ప్రచురింపబడిన చంద్రలత 9 కథల సంపుటి, 1/8 డెమ్మీ, 144 పుటలు, వెల: రూ.75/-. ప్రభవ ప్రచురణలు-సంఖ్య 3. డిసెంబరు, 2004. పై రెండు పుస్తకాలు ప్రతులకు విశాలాంధ్ర, అన్ని శాఖలూ, నవోదయ, విజయవాడ; ప్రభవ ప్రచురణలు 16-2-157, పొగతోట, నెల్లూరు-524 001. దూరవాణి: 2329567.

**మాకియవెల్లి అధికార రాజకీయాలు** రచన: కాట్రగడ్డ నరసయ్య, 1/8 డెమ్మీ, 24 పుటలు, వెల: రూ.5/-. ప్రతులకు: ప్రజాశక్తి అన్ని శాఖలలో.

**లోహం** (సుల్తాన్‌ని ప్రేమించిన పద్మజ కథ) రచన:స్కైబాబ, గోల్కొండ ముద్దెర ప్రచురణ: డిసెంబరు, 2004, 1425 హిజ్రీ, 1/8 డెమ్మీ, 24 పుటలు, ఖీమత్ రు.5/-. ప్రతులకు: హజీబేగం, కేశరాజుపల్లి, నల్గొండజిల్లా, తెలంగాణ-508 002, స్కైబాబ, 10-1-639, రెండవ ఫ్లోర్, చింతల్‌బస్తీ, ఖైరతాబాదు. హైదరాబాదు-500 004. సంచారవాణి: 94404 75004.

**హసీనా** (దీర్ఘకవిత) రచన: జాన్‌హైడ్ కనుమూరి, 1/8 డెమ్మీ, 16 పుటలు, వెల: రు.15/-. ప్రథమ ముద్రణ: డిసెంబరు, 2004. ప్రతులకు: జాన్‌హైడ్ కనుమూరి, 13-75, శ్రీనివాసనగర్‌కాలనీ, రామచంద్రాపురం, హైదరాబాదు-502 032. దూరవాణి: 08455-244184.

**దిక్కు మొక్కులేని జనం** (నవల) రచన: ఆలూరి భుజంగరావు, రాహుల్ సాహిత్య సదనం వారి ప్రచురణ. మొదటి ముద్రణ: జనవరి, 2005. 1/8 డెమ్మీ, 102 పుటలు, వెల: రూ.30/-. ప్రతులకు: అన్ని ప్రముఖ పుస్తక విక్రయశాలలు మరియు ఆలూరి భుజంగరావు, 26-33-34/1, ఎ.టి.అగ్రహారం, 7వ లైను, గుంటూరు-522 004. ✳

BC1



చెరబండరాజు 23వ వర్ధంతి సందర్భంగా:

# పాలేరు పాట

- చెరబండరాజు

కాడి నీదిగాదు కాడెద్దు నీదిగాదు
కర్రు నీదిగాదు ములుగర్ర నీదిగాదు
నాగళ్ళ మాటలేల రేగళ్ళ మాటలేల

పుల్లెద్దు నీదిగాదు బొల్లెద్దు నీదిగాదు
దొడ్డి నీదిగాదు గడ్డివాము నీదిగాదు
నాగళ్ళ మాటలేల రేగళ్ళ మాటలేల

గట్టు నీదిగాదు ఏ చెట్టు నీదిగాదు
చాట నీదిగాదు ఏ తోట నీదిగాదు
నాగళ్ళ మాటలేల రేగళ్ళ మాటలేల

బావి నీదిగాదు కోనేరు నీదిగాదు
పాడి నీదిగాదు ఏ పంట నీదిగాదు
నాగళ్ళ మాటలేల రేగళ్ళ మాటలేల

వానల్లు నీవిగావు కాల్వల్లు నీవిగావు
కొడవళ్లు నీవిగావు కోతల్లు నీవిగావు
నాగళ్ళ మాటలేల రేగళ్ళ మాటలేల

మబ్బుల్లు నీవిగావు కార్తెల్లు నీవిగావు
కంచెల్లు నీవిగావు కళ్లాలు నీవిగావు
నాగళ్ళ మాటలేల రేగళ్ళ మాటలేల

కుక్కిన పేనోలె నీవు కూర్చుంటే ఇంతేరా
నువ్వులేనిదే నువ్వుగింజయినా మొలవదనీ
కూలిగాదు పొలంమీద అధికారం అందరిదని

కలిసికట్టుగా నడిచీ తిరగబడీ పోరాడితె
నాగలేమి రేగడేమి రాజ్యానికి రాజువురా
కష్టాలూ కన్నీళ్లూ అప్పుడసలె వుండవురా

10.7.1972

(చెరబండరాజు మరణం 2 జూలై1982)



[JANASA]HITHI JULY, 2005 Rs.10/-
Postal Regd.No:PMG/VJ/13-19/03 RNI NO. APTEL/1977/571

# మా కళ్ళలోని అగ్గితో(టి)...

-ఛాయరాజ్

**అతడు:**
కడుపునిండ కూడుతినీ
నీ కాళ్ళకాడ కూకుంటా
రైతు రాజ్యమొస్తాది
నిను రాణిని చేస్తా పిల్లా!

**ఆమె:**
కళ్ళనిండ నీళ్ళతో(టి)
నీ కాళ్ళకాడ కూకుంటె
కలలే కంటన్నావు
కాటికి కాళ్జాపి నువ్వు
పసుపు, కుంకం చెరపకురో....
పురుగుమందు తాగకురో...
నాకంట నీరు పెడతాను
పంట పెట్టరో రాజ!

**అతడు:**
వంటినిండ గుడ్డకప్పి
నీ కళ్ళనిండ కనబడతా
రైతు రాజ్యమొస్తాది
నిను రాణిని చేస్తా పిల్లా!

**ఆమె:**
వంటినిండ వణుకుతో(టి)
నీ కట్టెకాడ కూకుంటె
కలలే కంటున్నావు
కాడెకాడ కాళ్జాపి నువ్వు
పిల్లా పిచుకను చూడరో...
పురుగుమందు తాగకురో...
నా వంటి నెత్తురు పెడతాను
పంట పెట్టరో రాజ!

**అందరు:**
ఏరుపూసినోడ్ని మరచి
ఏలుకోలేడెవడూ
బువ్వనిచ్చినోడ్ని చంపి
బాగుపడలేడెవడూ
.....................
రైతు బతుకు తీసెటోడు
బతికి పోతడనుకోకు
........................
చచ్చీ సాధించలేం
చితికీ చిగురించగలం
..............................
మా కళ్ళలోని అగ్గితో(టి)
కాగడాలు వెలిగిస్తాం
..............................
మా గుండెలోని రంగుపూసి
జెండా గుడ్డలెగరేస్తాం

**అతడు:**
చేతగానోడ్ని కాదు
చేతులు కలపండిరో

**ఆమె:**
నాదులు మీటండిరో
నవరాగాలను పలకండిరో

**అందరు:**
మా కళ్ళలోని అగ్గితో(టి)
కాగడాలు వెలిగిస్తాం.

◆



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA103M114 |
| పుస్తకం పేరు | ప్రజాసాహితి |
| తారీఖు | 07 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | naveeda |
| పేజీలు విడదీసినది | Naveeda |
| స్కాన్ చేసినది | Sharmila |
| పరీక్ష చేసినది | haseema |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |